# పీఠిక.



భాషాభిమానులారా :

భీష్మప్రతిజ్ఞయను నీనాటకము నిదివఱలోఁ గొందఱు భాషాపాండిత్యమును వెల్లడించుచు రచియించియుండిరి. అయినను, భక్తిరసపూరితముగ నిట్టిగ్రంథమును వ్రాసినఁ గొంతయైనఁ బాపహరమగునని శక్త్యనుసారముగ రచియించితిని. ఇదివఱలో 'దమయంతి' యను నొకచిన్న నవలను వ్రాసి యచ్చొత్తించియుంటిని. ఇదియే నేను నాటకములు వ్రాయుటకు మొదటిసారియైయున్నది. కావున, నెన్నియో తప్పులుండవచ్చును. పండితులట్టితప్పులున్నఁ దెలుపుచు క్షమింపఁ బ్రార్థించుచున్నాఁడను.

ఇట్లు,

గ్రంథకర్త.



# అంకితము



సీ. చిఱుత ప్రాయమునాఁడె ♦ చేరి వింధ్యాటవిఁ
తాటకిదునుమాడి ♦ దర్పమడఁచ
పతిశాపవశమునఁ ♦ బాషాణమైయున్న
సతియహల్యనుబ్రోచె ♦ సమ్మతమున
భుజవిక్రమముఁజూపి ♦ భూజాతఁ జేపట్టి
సంతసాంబుధిఁ దేల్చె ♦ జనులనెల్ల
రాక్షసావళిఁబట్టి ♦ రణరంగధీరుఁడై
వధియించి భూదేవి ♦ వంతమాన్పె

గీ. అట్టి జగదీశు శ్రీరాము ♦ నాదిదేవు
దీనజనరక్షకుండగు ♦ దివ్యమూర్తి
నతులభక్తినిఁగొల్చుచు ♦ నాత్మనెప్డు
నర్పణముసేతు నీగ్రంథ ♦ మంకితముగ.



# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

## పురుషులు.

భీష్ముఁడు — కథానాయకుఁడు

ప్రభాసుఁడు — అష్టవసువులలో నొకఁడు

వసిష్ఠుఁడు — ముని

మహాభిషుఁడు — రాజు

ప్రతీపుఁడు — శంతనునితండ్రి

శంతనుఁడు — భీష్మునితండ్రి

చిత్రాంగదుఁడు — } శంతనునికి మత్స్యగంధియందుఁ బుట్టినవారు
విచిత్రవీర్యుఁడు — }

మంత్రి — శంతనునిమంత్రి

దాశరాజు — మత్స్యగంధియొక్క జనకుఁడు

## స్త్రీలు.

గంగ —

మత్స్యగంధి — శంతనునిభార్య

ప్రభాసునిభార్య —

అంబ — }
అంబిక — } కాశీరాజు పుత్రికలు
అంబాలిక — }

వీరలుగాక కొందఱు రాజభటులు, పౌరులు సందర్భానుసారముగ వచ్చుచుందురు.

## నాంది.

ఉ. శ్రీరమణీమనోహరుని ♦ శీఘ్రకరుఁడంచును గొల్తు రెవ్వనిన్
శారదవిద్ నిరంతరము ♦ కమ్మనివాయువుకందమూల మా
హారముఁ జేసికొన్న మును ♦ లార్యులుపూజలొనర్చిభక్తిచేఁ
బేరునఁబిల్వఁ జేతు రఘు ♦ వీరుఁడు కావుత సభ్యులందఱిన్.



శుభమస్తు. అవిఘ్నమస్తు.

# భీష్మప్రతిజ్ఞ.

## ప్రథమాంకము.

[ప్రవేశము:—అష్టవసువులలో నొకఁడగుఁ బ్రభాసుఁడు భార్యతో]

ప్ర—(భార్యతో) కాంతా! నేఁడు వేడుకలరగ, విహారార్థమరుదెంచిన మనమీ ఋషిపుంగవుని దర్శించుటచే నెంతయు ధన్యులమైతిమికదా. నిరతము భగవత్పాదారవిందసేవయే ముక్తిప్రదాయకమని యెంచి, తపం బాచరించు నీమహామునుల కెందైనఁ గొఱఁతలుండునా? చూచితివా! ఈతపోవన మెంతరమణీయంబై యొప్పుచున్నదో?

సీ. క్రూరమృగావళుల్ ♦ క్రోధమూనవునిందుఁ
జేరుఁగురంగముల్ ♦ సింహములను
మదపుటేనుఁగులైన ♦ మదిఁ దాల్చుసుగుణంబు
విచ్చలవిడి నేగ ♦ వెఱచుఁగాదె
దివిజకంటకులయ్యు ♦ దీనులై దానవుల్
దఱిఁజేర వెఱతురు ♦ తాపసులకు

గోవులు బెబ్బులుల్ ♦ కోరినట్లొకచోటఁ
గూడిచరించును ♦ కుందరదన

గీ. జగములైవను నిల్చునే ♦ సాధులయ్యొ
శమదమములరెంటిని ♦ సరిగనిల్పి
నీరజాక్షునిపదసేవ ♦ నిత్యమనుచుఁ
దెలిసిభజియించుఁదపనుల ♦ ధిక్కరించి.

నిత్యమెడ తెగక మోహపాశబద్ధులై, దుఃఖాకులంబగు సంసారసాగరమును పీడనోపక, మదోన్మత్తులై, చరియించువారెల్ల దుఃఖాన్వితులగుట నిక్కము.

భా—నాథా! ఇత్తపోవనంబున నెచ్చోటఁగాంచినను, మంగళారవంబులో యనననొప్పు కోకిలారవంబులును, పంకజాక్షుని నివాసమగునా వైకుంఠమో యనునట్లుగఁ గనులపండువై యొప్పఁ బరిమళపుష్పలతాకుంజములునై, కన్పట్టుచు, నెంతయు సంతసమునుగొల్పుచుండెనుగదా.

ప్ర—తన్వీ! కొంతకాలమిట వేచియుండి, తపోనిష్ఠనుండితొలఁగినపిదప, మహానుభావుండగు నీవసిష్ఠమునిపుంగవు సేవఁజేసి, యాతనికృపకుఁబాత్రులమై, దీవనలందిపోవుదము.అంతదనుక నిందున్న వినోదములఁదిలకించి, మోదమందుదము.

భా—ప్రాణేశ్వరా! ఆమునిబాలకులఁజూడుఁడు. వారతిభక్తి నగ్నిహోత్రంబులకుఁబనికివచ్చు సమిధలనేరి, యొక్కచోఁ జేర్చుచుండిరి. వారలకుఁగూడఁ గందమూలఫలములే యాహారమగునుగాఁబోలును.

గీ. రత్నసౌధములందుండు ♦ రాజులెట్లు
పడయుసౌఖ్యములట్టులఁ ♦ బావనులగుఁ

గానవనంబులఁజరియించి ♦ కందమూల
ఫలములాసించుమునులును ♦ బడయఁగోర్కె ?

వ్రి—చెలీ! అటుపోయి కొన్ని ఫలముల భుజింతము రమ్ము.

(పోయి తిరిగివచ్చి)

భా—(ఆతురతతో) నాథా! అటుచూడుఁడు. హోమధేనువదిగో. దానిక్షీరములుగ్రోలినమానవులు, పదివేలవత్సరంబులిచ్ఛతో మనియుండఁజాలుదురని వినియుంటిని. మర్త్యలోకమున నుశీనరు నికూఁతురు జితవతియనునాపె, నాకెంతయుఁ బ్రియమును గూర్చుచెలియైయున్నది. ఆమెకు దీనిపాల నొసంగి, సంతుష్టి పఱుపనిచ్ఛవొడముచున్నయది. కాన,

గీ. నిక్కమగుఁబ్రేమనాయెడ ♦ నిల్పియున్న
నాథ ! యీకోర్కెఁదీర్పవే ♦ న్యాయమైనఁ
గాకయన్యాయమైనను ♦ గాంచకుండఁ
జెలికినర్పించి కీర్తిని ♦ జెందవలయు

వ్రి—(తనలో) అయ్యో! వనితలు రానున్న నుపద్రవములగ్రహింప నేరక, యసాధ్యమగుకోర్కెలఁ గోరుచుందురు. తెలియఁబల్కినను జెవిఁదాల్పరు. ఏమిసేయువాఁడ? దీనినిప్పుడు కొంపోతిమేని, యీముని క్రోధాగ్ని నెదఁదాల్చి, దహింపఁజేయుట సత్యము. ఎట్లైన నీపెను మరల్పఁజూచెదను. (ప్రకాశముగా) ప్రాణేశ్వరీ!

గీ. ఏటికోరికఁగోరితి ♦ వింతయైన
మదినిదర్కింపవలవదే ♦ మానికనిన
దహనమొనరింపఁజేయఁడే ♦ దారుణాగ్నిఁ
బడియుదాటుటశక్యంబె ? ♦ ప్రాణముండి.

కావున, నీకోర్కెనువీడుము.

భా—ఇందువలననే 'యబలల' మని మాకు బిరుదమొసంగఁబడెను. మదినిగలకోర్కెలఁ దీర్చుకొనలేని మాకు సంతసమెక్కడ ? సతులచింతలఁదీర్పనిపతు లెందైననుందురా ? పోనిండు. ఈనాఁడాదిగ, నేనెట్టివాటినివాంఛింపను. తామసాధ్యమనియు నెంచనగత్యము లేదు.

ప్ర—కాంతా ! యిందులకింతగఁ గినుకఁబూనుట చెల్లునా ?

ఉ. పంతముఁబూనఁజెల్లునె య ♦ పారముచింతలు మానియల్గినన్
వంతలమానుమింక సతి ! ♦ పాలనుమాత్రమె కాంచనేల ? నీ
సంతసమెన్నఁగల్గుఁగద ♦ శాంతము నామదిఁదప్పకుండ నో
యింతిరో ! ధేనువుఁగొనియె ♦ ద్దేగుదమేటికి ? కాలయాపనల్.

ఇది యేమనఁదగుసమయము. మనవారును నాయెడనే విహరించుచున్నవారలు. ఈతనిదృష్టులఁబడక, యాధేనువునుగొని, యాదిక్కుగనే పోవుదము.

(ఇరువురునిష్క్రమింతురు.)

వసిష్ఠుఁడు—(తపముచాలించి లేచి)ఏమిది? ప్రతిదినమును తపముసాంగమగుసరికి, బిడ్డకై వడి, దరికేతెంచి, యానందమునుగొల్పు నాహోమధేనువు యింకను రాకుండుటకు హేతువేమియొ ? ఈచుట్టుప్రక్కల నెచ్చోటనైనను మేయుచుండెనేమో యరసెదనుగాక. (అని పోయి తిరిగివచ్చి) ఎచ్చోటను గాన్పింపదయ్యె. ఇదంతయుఁజూడ నేదానవులైన దొంగిలించిరేమో యనియెడు శంకవొడముచున్నయది. (క్రోధభావమున) ఏమి ? వారిసాహసము ? అట్లయైన వారిపోమహిమచే నుకాడెద. (అని దివ్యదృష్టిఁజూచి) తెలిసినది. (కన్నులెఱ్ఱఁజేసి) ఓవసువు

లారా! దేవాంశసంభూతులమయియు యీకార్యము. ఘనతపో నిష్ఠనుండ, నిర్భీతిని బ్రేమకుఁబుట్టినిల్లగు ధేనువుఁగొనిపోతిరా? కానిండు. తత్ఫలమనుభవించెదరుగాక.

గీ. ఇంచుకైనను నపకార ♦ మెంచనుగద
చింతఁబుచ్చిరి కావునఁ ♦ జేటు కాదె
మర్త్యలోకంబునన్ బుట్టి ♦ మనుట యొప్పు
వంతలొందంగఁజనుఁడందు ♦ వసువ్రలార.

(అని శాపమొసఁగును. ధేనువునుద్దేశించి)

సీ. విడువఁజాలవుకద ♦ వీక్షింపకేవేళ
నట్టిదానవువీడి ♦ యెటులతాళి
యుండఁజాలితివో యీ ♦ యుగ్రాటవిని నిచ్ఛ
వర్తించునీకెట్టి ♦ బంధనంబు
చేకూరెనోకద ♦ చీరినంతనె చేరి
ముదమందఁదాకెదు ♦ బుద్ధినీవు
ఎడఁబాటుభరియింప ♦ నేవిధినినుఁగందు
దోషులైమనము నాం ♦ దోళపటిచి

గీ. కానకుండఁగఁగొంపోయి ♦ కలుషమతులు
యనుభవింపరెతత్ఫల ♦ మవనిఁబుట్టి
పొందరానట్టియిడుమల ♦ నందుచుండి
తిరుగనెన్నటికోకద ♦ ధేనువంద.

(వసువులుభయముతోఁ దిరుగఁబ్రవేశింతురు.)

(ధేనువునర్పించి పాదములమీఁదికొఱఁగ)

గీ. శరణు మానీశసైరింపు ♦ శరణుశరణు
బుద్ధిమాంద్యంబుననునిట్టి ♦ పోకడలను

కోతిమొట్టులకా చెడో ♦ పూతచరిత
యొట్టులోర్తుము పోవంగ ♦ నిలవసింప.

మహానుభావా ! దుర్బుద్ధిఁ దెల్లో నర్చి యపరాధ మొనర్చితిమి. మేమెట్లా పృథ్వి నిరతముఁ జరియింపఁగలము ? మాతప్పులను మన్నించి రక్షించెదరుగాక.

వ—(శాంతమూని) మీరు తగనిపని యాచరించితిరి. కావున శాప ముతప్పదు. పుట్టినతోడనే గిట్టి తిరుగ మీనివాసంబులఁ జేరఁ బోనఁగల్గుదురు. కాని, యీయష్టమవసువుండగు ప్రభాసుఁడు కృష్ణుఁగ దోసమాచరించెఁ గావున నీతఁడు చిరకాలము భూలోకమునఁనుండి బ్రహ్మచర్యవ్రతముతో వరలును.

వ—(వందనములర్పించి) దేవా! సెలవొసంగుఁడు.

(అందఱును నిష్క్రమింతురు.

(యవనిక జారును)

---

## ద్వితీయరంగము.

---

[గంగామహాభిషులు భూలోకమున కేగుచుష్టవసువులఁగాంతురు]

గం—(తనలో) వీరికి వసిష్ఠమునివలన శాపము కల్గెనని యింతకుముందే వినియుంటిని. అందువలననే, ఖిన్నవదనులై పోవుచున్నవారలు. (సమీపించి ప్రకాశముగా) వసువులారా ! తొలిఁ జేసిన పాపమనుభవింపక సెల్లువా ? కాకున్న, ధర్మాధర్మ విపక్షత నంతయు దెలిసి దేవవంశసంభూతులై యొతడో వేడుకతోఁ గాలమును బుచ్చు మీకీయిక్కట్లు ప్రాప్తించనేల ?

వ—మీరలెవ్వరు ? ఎందేగెదరు ?

గం.—ఈతఁ డిక్ష్వాకువంశదీపకుండగు మహాభిషుఁ డనువాఁడు. అశ్వమేధంబులు మొదలగు ననేక మహాక్రతువులఁ బెక్కింటి నొనర్చి యాపుణ్యవశంబున స్వర్గలోకసుఖములందుచుండ నొక్కనాఁడు దేవలోకంబున జరగుసభకు జాహ్నవినను ప్పు నేనుగూడ నందుఁబోతిని. పిదప, ప్రమాదవశంబున—

గీ. చీరచెఱఁగును దొలఁగఁగఁ ♦ జెంతనున్న
వారుముఖములనవలకు ♦ వరుసఁబుచ్చ
నీతఁడట్టులెచూచుచు ♦ వెతలఁజిక్కి-
నంత కమలభవుఁడలిగి ♦ యనియె నిట్లు.

ఉ. దోసముఁదల్పకుండనిటు ♦ దూషణలందగ నెంచినాఁడవో?
వేసముమానుమింక తడ ♦ వేటికి యేగుము మర్త్యలోకపుఁ
బాసలఁజూపనేల పద ♦ భాగులఁ గన్నులఁ గాంచఁ బాడియే
వాసమొచేయుమీ నరుఁడ ♦ వైరులజన్నము నొందియుఁ వెన్

ఈరీతిశాపమొంది, దుఃఖాక్రాంతుఁడై పోవుచుండ, నేనునుపీనియుం దుండెడు ప్రేమాతిరేకమున, నీతనికి సతినై యుండఁబోవు చుంటిని.

వ—అటులైననిన్నొక్కటివేడెదము. సదయాంతఃకరణవై నర వేర్చెదవుగాక:

గీ. గర్భమున మాముధరియించి ♦ గడపవమ్మ
జననమొందినవెంటనే ♦ జాగుసేయ
కుండ నంతమొనర్పుము ♦ క్రూరబుద్ధిఁ
జేసియున్నట్టి కలుషంబు ♦ చెడును వెనుక.

అంతియేకాని, మేము వేఱొండుగర్భముల జనియింపఁజాలము తల్లీ !

గం—మీకోర్కెల నెరవేర్తును. కాని, మీలోనొక్కని నాకు విడువ వలయును.

వ—మాలోనష్టమవసువ్వుండగునీతఁడు, మాయందఱికంటె నెక్కు డపచారముఁ గావించెనని చిరకాలము భూలోకముననుండున ట్లు ముని చెప్పియుండెను. కావున నీయభీష్టమును దీర్పుకొమ్ము. ఈభూపాలుఁడెవ్విధినుదయించును?

గం—ఇప్పుడచ్చోటఁ బ్రతీపుఁడను రాజుకలఁడు. ఆతనికి సునందాదేవి యందుదయించి, రాజాధిరాజై ఖ్యాతివడయును.

వ—అట్లైన మేమెంతయు ధన్యులము.

గీ. పాపవశమున నరులమై ♦ వఱలఁగనున్న
గుడ్డిలోమెల్లయును నట్లు ♦ క్రూరులైన
వారియందునఁబుట్టియు ♦ వంతలొంది
యనుభవించుటకంటెను ♦ నధికమిదియు.

(అందఱును నిష్క్రమింతురు.)

---

## తృతీయరంగము.

---

(భూలోకమున నరణ్యప్రదేశము)

(ప్రవేశము:— గంగానదీసమీపమునఁ దపంబొనరించు ప్రతీపుఁడు, గంగ స్త్రీరూపమున)

గం—(తనలో) ఆహా! యిదియేసమయము. ఇప్పుడీతని దఱిఁ జేరి, యెట్లైనఁ బుత్రునిఁగ నిచ్చువాఁడమునట్లొనర్పవలెను. కాకున్న నాకోర్కెనెఱవేరుటెట్లు? అందులకీతఁడిష్టపడకున్న నెన్నియో కార్యములకు విఘ్నము సంభవించుననుట నిక్కము.

(దగ్గరకుఁబోయినిల్చును.)

ప్ర—(కన్నులందెఱచి, గంగనుగాంచి)

చం. వనితరో వాసమేది? మది ♦ వాంఛలనేమియొ తెల్పవే యిటుల్
వనమునసంచరించు వెత ♦ పాయగఁగాంతునిగల్గి యుండెనో
మనమున నున్న చింతలను ♦ మానకవీడుము శక్యమైన నీ
కనవరతంబుసౌఖ్యముల ♦ నంతముగాగను జేయనెంచితిన్
కావున, నీయెదఁగలఁజింతల వెలిఁబుచ్చుము.

గం—రాజా! చల్లకైపోయి ముంతను దాచనేల? ఏను గంగను. నీ సౌందర్యమును గాంచి,

గీ. మానవతినయ్యు ముందుగ ♦ మనుజనాథ
మానసంబును వెలిఁబుచ్చి ♦ మనలుచుంటి
సతిగఁజేకొనవేఁడెద ♦ నతులభక్తిఁ
గొల్చుచుండెదనిరతముఁ ♦ గూర్మితోడ.

ప్ర—(ఆశ్చర్యముతో) ఏమిది? ఎంతయుఁజోద్యమయ్యె. కాలమంతయుఁగడపి, వార్ధక్యము ప్రాప్తింప, సంసారసుఖములనన్నిటిని వీడి, నిరతము, ముక్తిప్రదాయకమగు నారాయణపదారవింద సేవ నొనర్ప, నివ్వనమున కేతెంచి, నాకుఁ బరిణయమేటికి? అందువలనఁగల్గెడు సుఖములేల? హాస్యమొనర్చుచుంటివా?

గం—మిముఁబోలిమహానుభావులతో ననందర్భపువాక్కుల నుడువునంతటిబుద్ధిహీనురాలననియే యెంచితిరా?

ప్ర—అట్లయినఁ దొలుత నీకుపకారమొనర్చెదనంటిని. కాన, నా పుత్త్రుని నీకుఁ బతిగనుండ నియమించెదను.

గీ. కాననేగుమువలదింక ♦ కలఁతనొందఁ
దీరునీకోర్కె తప్పక ♦ ధీరచరితుఁ
డైనయాతనిఁ జేపట్టి ♦ తనరుమట్లు
వరమునిచ్చితిఁ గైకొమ్ము ♦ వనిత! పొమ్ము.

౧౦.—మహాప్రసాదము.

గీ. సెలవు నొసఁగుఁడు పోయెదఁ ♦ జింతవీడి
ధన్యనై తిని మిముఁ గాంచి ♦ ధర్మమంచు
ఫలముఁ గూర్చెడు భారము ♦ భావమందు
మఱువకుందురుగాక యో ♦ మాన్యచరిత.

(నిష్క్రమించును.)

(తెర పడును.)





శుభమస్తు అవిఘ్నమస్తు.

# భీష్మప్రతిజ్ఞ



## ద్వితీయాంకము.

---

ప్రదేశము.—రాజసౌధము

(ప్రవేశము.—ప్రతీపుఁడు పుత్రుఁడగు శంతనునితో)

ప్ర—కుమారా! ఏ మిదివఱకే వృద్ధులమై, తపమాచరింప, నరణ్యములకేగితిమి. కాని, కొడాఁకకతంబున నిట్లుతిరుగఁబుత్త్రునికై తలపడి, దేశములన్నియుఁ జుట్టివచ్చి, తుదకుఁ గొంతకాలమునకు నిన్నుఁ గంటిమి. నీకుఁ బ్రాయమువచ్చువఱకు వేచియుంటిమి. ఇఁక నీరాజ్యభారమంతయు నీయదే.

శం—జనకా! మీయిష్టానుసారము వర్తింతును. కాని, మిమ్ములవీడి యెట్లు చరింపఁగలను?

ప్ర—అదియునుసహజమే. నీకొకసంగతి నేకాంతముగఁ జెప్పవలసియున్నది. దగ్గరకురమ్ము. ఈవు కాననమున కేగినవేళ నొకయువతికన్పట్టెను. ఆపె నిన్ను వలచివచ్చిన, నేమియు నడ్డుసెప్పక కూడి సుఖించుము. ఇదియేనాకోరిక.

శం—(తనలో) ఏమిది? కాంతయెవత్తెయో నాకొఱకు వనములవేచియుండునఁట. ఎంతయు నాశ్చర్యము కలుగుచున్నది. ఏమైనను తండ్రియాజ్ఞను దలఁదాల్చుటయే కర్తవ్యము. (ప్రకాశముగా) నాయనగారూ! ఆజ్ఞకు బద్ధుఁడను.

గీ. జనకునాజ్ఞను దలఁదాల్చి ♦ జరుపనగును
గాక మీరుట శక్యంబె ♦ కరుణఁజూపి
తగినపనులను నియమింపఁ ♦ దలఁచుచుండుఁ
గాని వేఁడుగనెంచునే ♦ కన్నతండ్రి

ప్ర—కుమారా! మేమిఁక తడవుసేయుటతగదు. పోయివచ్చెదము.

శం—తండ్రీ! చిన్ననాటనుండియు నొక్కక్షణకాలమైన విడచియుండనివాఁడ, నేఁడాది, నెట్లు మిమ్ములఁబాసి, వర్తింపనగును?

ప్ర—ఎన్నఁడైనవీడక తప్పునా? ఇందులకింతగ విచారింపఁదగదు. శాంతినూనుము.

(నిష్క్రమించును.)

శం—నాజనకుని పలుకులఁదలఁప, నింపుకయాసవాఁడఁగుచున్నయది. ఎప్పుడావనితనుగాంచగల్గుదునో యని మనంబు తొందరించుచున్నది, ఎట్లులైనఁ ద్వరితంబునఁ బోవయత్నించెదను గాక! సేవకా!

(సేవకుఁడు ప్రవేశించి)

సే—దేవా! ఏమిసెలవు?

శం—నీవుపోయి, మంత్రినొకమాఱు తోడ్కొనిరమ్ము.

ప్రవేశము:—మంత్రి

శం—మంత్రిశేఖరా! రమ్ము. కూర్చుండుము.

మం—చిత్తము. ఏమియాజ్ఞ?

శం—ఒకమాఱు వేటకై, యడవికేగ బుద్ధిపొడమినది.

మం—రాజులకుండఁదగుఁ గోరికయేకదా.

శం—కాన, నందులకుఁ గావలసినయత్నము లొనరింపనాజ్ఞాపింపుము.

మం—చిత్తము.

(ఇరువురును నిష్క్రమింతురు)

(తెరపడును.)

ద్వితీయరంగము.

---

అరణ్యసీమ.

ప్రవేశము:—శంతనుఁడు.

శం—ఆహా! నేఁడెంతయు వినోదమయ్యె. వేటయనిన, నింగులకే, రాజులెల్లఁదహతహపడుచుందురు. క్రూరమృగములనెల్లఁ దునుమాడితిని. సేవకులందఱు చెల్లాచెదరైరి. ఇంకను బొద్దెంత యోకలదు. కాన, నింకున్న విశేషముల నరయుచుఁ గొంత కాల మిట విహరించెదను.

(ఇటునటుసంచరించుచు.)

సృష్టివైచిత్ర్యమెంతయు వర్ణనాతీతముకదా.

సీ. ఎచ్చోటఁగాంచిన ♦ నిచ్ఛతోవర్తించు
ఘోరమృగావళుల్ ♦ గోచరించు
అదియునివాసమై ♦ యలరునెల్లప్పుడు
నాహారమయ్యెడు ♦ నట్టిజంతు
సముదాయమీవన ♦ సంచారమొనరింప
ధీరత్వమడుగంటు ♦ దిగులుతోచు
వాసయోగ్యముకాదు ♦ వసియింపనరులిందు
నెట్టులోర్తురోమది ♦ నెన్నవశము

గీ. సృష్టివైచిత్ర్యమెంతయో ♦ చూడఁజూడ
వింతగొల్పుచునుండెను ♦ విబుధులైనఁ
దెలియశక్యంబె ధాతాజ్ఞ ♦ తేటపడున
కనులఁగనుచు సంతసమును ♦ గాంచవలయు.

(ప్రవేశము.—గంగ స్త్రీరూపమున)

శం—(ఆశ్చర్యముతో) ఎవ్వరీవనిత? ఇట్లొంటరియై, చరించుటకుఁగతం బేమియో? ఈమెవన దేవతయో? కాక దేవభామినియో? లేకున్న నిట్టిసౌందర్యమున నలరారు వనితలుభూలోకముననుందురా? (ఇంచుకయాలోచన నభినయించి) రంభ, యూర్వసులలో నొకతెయై యుండునా? హృదయమా! యించుకతాళుము ఏలనింతయాందోళనము? నాలోనేనితర్కించనేల? దగ్గరకుఁబోయి యరసెదఁగాక.

(అని కొంచెము దాపునకేగును.)

గం—(తనలో) ఈశంతనుఁడు నన్నుఁగాంచినంతనే మనముచలించి, మన్మథబాణపరంపరలచే సొక్కుచు,డాయవచ్చుచున్నవాఁడు. తొలుతఁ గొంతకాల యాపనఁజేసి చూచెదను.

(వాలుకంటి యాతనిఁజూచి, యింకొకప్రక్కకుమరలును)

శం—ఏమి? ఈకాంత నన్నుఁ జూచుట కోడనీ, క్రీగంటఁగాంచి మరలినది. ఆచూపులకర్థమేమైయుండును?

గీ. మోహమువెలిఁబుచ్చు ముదిత ♦ ముద్దుమోముఁ
జూపి, తూపులఁబరపెసు ♦ సొబగుఁదోఁప
నేమిహేతువో? వలపుచే ♦ నిట్లుకనెను
కాక, నామదికలఁగుట ♦ కతనఁదలఁపొ.

(మరలనావైపునకుఁజూచి) లేనవ్వుమోమునఁదోఁప, నడుమ

నడుమ, నన్నుఁ దిలకించుచు, నేనుతిరిగిచూడగనే. తానుజూడ
నట్లు నటింపుచున్నయది. ఈచర్యలన్నియు మదనుని శరము
లోయనునట్లు, పీడించుచున్నయవి.

గం—(తనలో) ఈరాజేంద్రుఁడంతకంతకు, విరహవారిధిని మునుఁగు
చుఁ దనలోఁదాను దర్కింప మొదలిడెను. వనితలుముందుగవల
చివచ్చినఁ బురుషులతిచుల్కనగఁ జూతురు. అందుచే ముందుగ
నాతనిచేఁ బలుకరింపఁబడి, నావాంఛ నెఱిఁగింతును. లేకున్న,
నా యూహాలకంతరాయమును నేనేకల్పించుకొన్న దాననగుదును

శం—(తనలో) ఇట్లు నాలో నేనుగుందుచు, సంశయించుచున్న నేమి
ప్రయోజనము ? (అనిదగ్గరఁజేరి) (ప్రకాశముగా) వనితా !
నీవెవ్వరిదానవు? ఏకతంబున నిట్టి దారుణారణ్యంబుననొంటరి
గఁ జరించుచుంటివి ?

గం—(సిగ్గునభినయించుచు) స్త్రీలనుగాంచిన పురుషు లూరక, యేది
యో నెపమునఁ బలుకరింపఁజూతురు. (చిరునగవు మొలకలె
త్త) ఏ నెవ్వరిదాననైనఁ దమకెందులకు ?

శం—ఎవ్వరిదానవని యడుగుటయే దోసమా ?

గం—దోసమని యెవ్వరనిరి ?

శం—నీ నుడువుల కర్థమేమి ?

గం—స్వాభావిక మిట్లుండెనని యంటిని. మీర లెవ్వరో యడుగ
వచ్చునా ?

శం—ఏను శంతనుఁడను నృపుఁడను. మృగయావినోదార్థమీ కానన
మున కరుదెంచి, కొంతకాలమిట విహరించి పోవుదమనియె
డుతలఁపునఁ దిరుగుచుంటిని. అంతనిన్నుఁ గాంచి.

గం—మోహపాశబద్ధులైతిరి కాఁబోలును ?

శం—(తనలో) ఈసుదతినిపుణత యెంతయుశోచనీయము. (ప్రకాశ
ముగా) దాచనేల? అగును.

గం—తమయక్కర తీరువరకును సమితంబగు ప్రేమనుజూపుచుం
దురు. పిదప

శం—(తడఁబడుచు) అందఱు నట్లేయుందురా?

గం—ఉండకుందురని వక్కాణింపఁగలరా?

శం—అదియునసాధ్యమే.

గం—(పోఁబోవును.)

శం—(ఆతురతతో) ఎటకుఁబోవు చుంటివి?

గం—నానివాసమునకు.

శం—(చింతాక్రాంతుఁడై తనలో) ఏమైనఁగానిమ్ము. నామనంబెఱిం
గించెద. (ప్రకాశముగా) సుదతీ! నాదొక కోర్కెకలదు.

గం—ఏమది?

శం—తెల్పిన.

గం—(తనలో) ఇఁక తడవొనర్చి, యీతనిఁ బాములముంచుట పాటి
కాదు. (ప్రకాశముగా) రాజా! నీకోర్కెనుదీర్చిన, నాకోర్కెను
సఫలమొనర్తువా?

శం—సందియమేల? తప్పక నీయిచ్చవచ్చినట్లు వర్తింతును.

గం—నిక్కమేనా?

శం—ముమ్మాటికిని సత్యము.

గం—అట్లైనఁ దెల్పెద వినుఁడు. మీవలన నాకు జనించెడు పుత్రుల
నాయిష్టమువచ్చినట్లుచేయ వరంబీయవలయును. ఎన్నఁడందుల
కెదురాడుదురో, యానాఁడె వీడిపోవును. అందులకు మీకం
గీకారమేనా?

శం—(తనలో) సుతులనేమిసేయునోకదా! ఎట్లైన శపథమొనర్పక తప్పదు. లేకున్న సాంగత్యమే కలుగుట దుర్ఘటము. (ప్రకాశముగా) అటులనే యొనర్చెదను.

(ఇరువురునుగలిసి నిష్క్రమింతురు.)

---

తృతీయరంగము.

---

ప్రవేశము—గంగ.

గం—ఇప్పటికి నాకోర్కెలన్నియు నెఱవేరినవి. తలంచినట్లుగ నెనిమిదవ పుత్రుఁడు జన్మింపగనే, శంతనుఁడాతని మడియింపఁజేయవలవదని నుడువుటచే, నాతఁడీలోకంబున బెక్కుకాలముండుటయుఁ గూడినది. ఇంతదనుక నస్త్ర శస్త్రవిద్యలఁగూడ నభ్యసించి దినదినప్రవర్ధమానుఁడై, వర్తిలుచున్న నాయీబాలు నెంతకాలమీరీతినాయొద్దనుంచుకొనినను వ్యర్థమేకదా! కాన, నీమాఱు శంతనుండిచోటకు వచ్చినతఁడనే,యాతనికిచ్చివేయుదును.

(ధర్మప్రతుఁడొక్కచోధనుర్విద్యానైపుణ్యమును వెల్లడించుచుండఁ బ్రవేశము—శంతనుఁడు)

శం—(తనలో)

గీ. బాలుఁడీతఁడు చూపుల ♦ బాహుబలము
వర్ణనాతీతమై యొప్పె ♦ వసుధనిట్టి
తనయుఁగాంచినఁ దండ్రుల ♦ ధన్యతెంతొ
ముద్దుఁగొని మోదమొకమాఱు ♦ పోయివేగ.

(కొలదిదూరమునసనుండి) కొంతకాలమిట వేచియుండి, యాత

ని ధనుర్విద్యాపాటవమునుగాంచి, పిమ్మట నెవఁడో యరసెదనుగాక. ఎంతయుఁ గన్నులపండు వగుచున్నది.

గం—(ధర్మవ్రతునిదగ్గరకుఁజేరి, శంతనునితో) రాజా!యీతఁడే మన ముద్దులకొమరుఁడు. విద్యాపరిపూర్ణుఁడై వెలుగందుచుండెను. ఇంతటినుండియు నీతని నీయొద్ద నేయుంచుకొనుము. మనకిరువురకును సంబంధ మిదివఱకే తీరెను. (పుత్రునివైపుఁదిరిగి)నాయనా! ఈనాఁడాదిగ, నీవీతనికడనుండి, తగురీతిని వర్తింపుము. రాజా! సెలవొసంగుము. ఈతఁడీపృథ్వినెంతయుఁ బ్రసిద్ధివడయుఁ బురుషుఁడగును.

(గంగనిష్క్రమించును.)

శం—ఏమి నాభాగ్యము. పుత్రకా! నీవంటి యసామాన్యధీరవర్యునిఁ గుమారునిగఁ బడసిన నాపుణ్యమేమని వర్ణింపఁగలను? మనమింక పురమునకేగుదము.

(అనియిరువురును నిష్క్రమింతురు.)





శుభమస్తు అవిఘ్నమస్తు.

# భీష్మప్రతిజ్ఞ

తృతీయాంకము.

ప్రదేశము—సభామంటపము.

ప్రవేశము—శంతనుఁడు, మంత్రి

శం—సచివవరేణ్యా! ఎంతయో కాలమునుండి, సదయహృదయుఁడవగు నీవు, రాచకార్యపర్యాలోచనాపరుఁడవై మిత్రునికైవడి, సాహాయ్యమొసఁగుచుండఁ గడుసంతసంబున నెట్టికొఱంతయును లేక, కడపఁజాలితిని. పరిపాలకులొకింత యేమఱిపాటుననున్నఁ బ్రజలనిందలకుఁ బాత్రులగుటయే కాక, దుష్టశిక్షకుఁడగు నా పరమేశ్వరుని యాగ్రహమునకుఁ జోటొసంగినవారలగుదురు కదా! అందువలననే.

ఉ. డెందము కాంతిఁ బాయు నిది ♦ డీకృతమైన యరణ్య మట్లు సూ
నందము డాయుఁ దా వెలచు ♦ నవ్వులనిందలు చేరఁ జూచు నా
క్రిందన లేకయుండ నెదఁ ♦ గాంచగ రాజుకు నెట్టిచింతయో
యొందును జూడ మిట్టి వెత ♦ లెవ్వరి దాపునఁ జేర వెన్నఁడున్.

ఇట్టిచింతలనిసుమంతయుఁ గనక, రాజ్యాధికారమెంతయు

స్వేచ్ఛావిహారమని తలఁచుచుందురు; పుత్రసంతతినిఁగల్గియున్న నేవేళనీమహాభారమును వీడబుద్ధివొడమునో యప్పుడే తన యుని బట్టభద్రునిఁగఁ జేసి సుఖింపనగును. పుత్రులఁగనినందుల కిదియేకదా ఫలము.

సీ. చిరుతప్రాయమునాఁడు ♦ చేరివేడ్కలరఁగ
ముద్దుపల్కులనెంతొ ♦ మోహఁబుచ్చు
విద్యలందెడువేళ ♦ విజృంభణముగాఁగ
సుస్థిరధీరతఁ ♦ జూపుచుండు
యౌవనవంతుఁడై ♦ యలరెడుదినముల
సాహాయ్యమొనరించు ♦ జనకునకును
కతిపయదివసముల్ ♦ గడపివార్ధక్యముల్
గడపుఁబితృవిజింతఁ ♦ గప్పివైచి
గీ. భారమంతయుఁ దాబూని ♦ భవహరమును
నిత్యసౌభాగ్యమైయొప్పు ♦ నీరజాక్షు
పాదసేవితుఁ జేయఁడే ♦ భవ్యచరితుఁ
డైనఁబుత్రుఁడుజనియింప ♦ నరయమిత్ర.

పిలోకా! రాజ్యమును బాలింపఁదగుఁ గాలమింక నున్నను, సకలవిద్యాపారంగతుఁడై, వివిధోపాయంబులఁ బ్రజలఁ బాలింప శక్తినొందియున్న, నాముద్దుల కొమరుండగు ధర్మపుత్రుని రాజ్యాభిషిక్తునిఁ జేసి, యీరాజ్యభారవహనక్లేశమును వీడి యానందమునఁ గాలముఁ బుచ్చ బుద్ధిగలుగుచున్నయది. ఇందులకు నీయభిప్రాయమేమి?

మం—ఆర్యా! మీరలెఱుఁగని ధర్మములుకలవే! తామనినట్లాయువరాజునందుల కర్హుఁడే కాని, యింతబాల్యమున నాతనిరాజ్యగ నొనర్పుటకంటెఁ దా మీరీతిస ధర్మానువర్తనులై కాలమును

గడపి తుదకు వార్ధక్యమున భగవదారాధనాపరిమత్తులగుచు, దీనిని వీడిన నుచితంబని తోఁచుచున్నది.

శం—నాయందుండెడు వాత్సల్యముచే నిట్లనుచుంటివి. ఆతని నొక మాఱు పిలువనంపుము.

మం—సేవకా!

[సేవకుఁడు ప్రవేశించి] దేవా! ఏమిసెలవు?

మం—నీవేగి రాజాజ్ఞనుదెలిపి యువరాజనిటకుఁ దోడ్కొనిరమ్ము.

సేవ—చిత్తము. [నిష్క్రమించును.]

[ప్రవేశము—దేవవ్రతుఁడు]

దేవ—జనకా! పుత్రుని కృతార్థవందనములఁగైకొనుఁడు.

శం—ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు. కుమారా! రమ్మిటు కూర్చుండుము.

దేవ—తండ్రీ—ఏమియాజ్ఞ?

శం—తనయా!

చ. కడపితినింతకాలమును ♦ గాంచుచుబిడ్డలకైవడిన్ ప్రజన్
కడపితినింద్రితేజమునఁ ♦ గావరమున్ దఱిఁజేరనీక నే
కడుపగనెంచితిన్ బిదపఁ ♦ గార్యకలాపము రాజ్యభారమున్
విడచియునిత్యమున్ మదిని ♦ వీడక కొల్చుచు నీరజాక్షునిన్.

ఇదియునుఁగాక,

గీ. ఎన్నినాళ్లున్న జీవున ♦ కింతయైన
బుద్ధికల్గనెకోర్కెల ♦ పుట్టినిల్లు
చేయుకొలఁదిని పాపంబుఁ ♦ జేర్చుచుండు
నట్టి యిహలోకసౌఖ్యంబు ♦ నవలఁబుచ్చు.

కావున, నిన్నీ రాజ్యమునకుఁ బట్టభద్రునిగ నొనర్ప నెంచినాఁడను. అంతకుమున్నుగ నీవొనర్పవలసినఁ గార్యమొకటికలదు. ఇంతద

నుక నెట్టియాటంకములఁ జెప్పినను, నీమనంబున కెట్టికష్టములు చుదో పకుండుటకై, యూరటనొందియుంటిని. ఈనూరైన నడ్డుసెప్పక, చెవిఁ జాల్చి, నన్నానందవార్ధిని దేల్చుము. అదేమంటివేని,

గీ. సద్గుణంబులనలరారు ♦ సన్నుతాంగి
నొకతెఁ జేపట్టిసుఖయింప ♦ నుచితమౌను
గాక, పొల్పుగు నేయిట్లు ♦ కలఁతనొందఁ
జేయజనకుని పుత్రికా; ♦ చింత కాదె.

ధ—నాయనా! మీరిట్లనుచుపుట పాడియగునా? ఎదురాడితినని కిను కఁబూనకయుందురుగాక యసికోరుచుంటిని. ఏనేడ ? రాజ్యాభి షేక మెచ్చట? కొంత కాలమీరీతిని మీమాటునడాగియుండి, మిత్రబృందమునుగూడి, స్వేచ్ఛావృత్తిని విహరించుచు, సం తోషాతిశయంబుల మెలఁగక దుర్భరమగునాకీ రాజ్యభార మేల?

సీ. భవదీయయాజ్ఞలన్ ♦ భక్తితోఁ దలఁదాల్చి
మెలఁగునాకీరాజ్య ♦ మేలనగునె
తోడివారలతోయ ♦ థోచితంబగునట్లు
యాటలందేగువాఁడు ♦ నవని నేల
నగునె? విద్యలనందఁ ♦ దగు కాలమిప్పుడు
గాతూహాలంబునఁ ♦ గాలమెన్న
దిన మొక్క ఘడియగఁ ♦ దేలిపోవుచునుండ
నగునె రాజ్యముఁబూన ♦ నార్యయిట్టి

గీ. చిన్నతనమునదుర్భర ♦ చింతయనక
పాడియేజనక రాజ్య ♦ భారమెంతొ
తెలిసియుండియుసయిమింప ♦ ధీరవర్య
వలదురాజ్యమదింకను ♦ వలదువలదు.

ఇఁ బరిణయమన్ననో, దానికినిగొంతగనువున్న, సంతోషదాయకమగును. (అని తలవంచియూరకుండును.)

(సేవకుఁడొకఁడు ప్రవేశించి)

రాజా! పౌరులుకొందఱేతెంచి, దర్శనార్థము వేచియున్నారు.

శం—సత్వరంబుగఁ దోడ్కొనిరమ్ము.

(పౌరులు ప్రవేశించి)

పౌ—సార్వభౌమా! వందనములు.

శం—శుభమగుగాక. ఏమి? యింతయాందోళనకుఁ గలహేతువును దెల్పి, నామదినిగుదురపఱుచుఁడు.

పౌ—మహాత్మా! ఏమని తెల్పుదుము.

సీ. క్రూరమృగావళుల్ ♦ కూడియుఁ జెలరేగి
చిందరవందర ♦ చేయఁదొడఁగె

శం—కటకటా!

పౌ— కన్నుల ♦ గాంచుటమెతడవు
మెట్టిశూరులనైన ♦ నిట్టె చంపు

శం—అయ్యయో!

పౌ— రాజేంద్ర ♦ యార్తిఁ దీర్పకయున్న
నెట్లుతాళుదుమయ్య ♦ యీవెదిక్కు

శం—ఘోరము భరియింపఁ

పౌ— గూడునుకఁ బవమ్యో
సస్యాదులన్నియు ♦ సమసిపోయె

శం— గీ. తెలియదాయెను మీరుదిం ♦ తిలుటమాని
చనుఁడు వేగమె యేనును ♦ సాహసమున
దానుమవెడలెదనడవికిఁ

పౌ— దోడులేక,
పోవవశమానె యిండ్లకు ♦ భూమిపాల.

శం—అటులైన నందఱముఁగలిసియే యేగుదము. మంత్రిసత్తమా! వీరివంతలనన్నిటి వింటివికదా. సత్వరముగ వేటకువలయు సాధనములఁ గూర్ప నాజ్ఞాపింపుము. నేఁటిదినముననే బయల్వెడలని శ్చయించితిని. ఏనుదిరిగివచ్చువరకు రాచకార్యములఁ జక్కఁబఱుపుము.

మం—చిత్తము.

శం—సేవకా! ఈపౌరులను దోడ్కొనిపోయి, తగురీతినిసన్మానింపుము. చాలతడవైనది. ఇఁకపోవుదము.

(అందఱునునిష్క్రమింతురు.)

(యవనికజారును.)

---

ద్వితీయరంగము.

---

(అరణ్యసీమనుయమునానదీప్రాంతము.)

(ప్రవేశము—శంతనుఁడు.)

శం—ఆహా! యీబెబ్బులికై యొంటరిగనెంతదూరమే తెంచితిని? ఈ వేటతమకంబున, దాహమంతకంత కతిశయించుచున్నయది. ఈ నదీజలమును గ్రోలి శాంతినొందెదఁగాక. (అనినీటికైపోయి) ఈనదీప్రాంతమెంత రమణీయమైయొప్పుచున్నది. ఇచ్చోటనెంత కాలమున్నను దనివితీరునా? ఇందుఁగొంత కాలము విహరించి, సేదఁదీర్చుకొనిపోయెదను. (అనియొక్కచోవిశ్రమించును.)

(ఇటునటుపరికించుచు, నావపైమత్స్యగంధినిగాంచి)

(ఆశ్చర్యముతో) ఈబిడ యెవ్వతెయైయుండును? ఇట్లొంటరిగనీనావనుం

డుటకుఁ గతంబేమియొ? ఈవనితాసౌందర్యమును వర్ణింప నా
యాదిశేషుఁడైన నర్హుఁడగునా?

సీ. నిండుచందురుఁబోలు ♦ నెమ్మోముఁదిలకింపఁ
బద్మపత్రంబులు ♦ పడఁతికనులు
మేనుసోయగమెన్న ♦ మెఱుమిట్లుగొల్పు నా
మెరుగుతీగనుగూడ ♦ మించియుండె
మనుజకాంతయొకాక ♦ మరునిపూబంతియొ
సుదతిసొబగుఁజూడఁ ♦ జోద్యమయ్యె
కనుగవఁదిలకింపఁ ♦ గమలాకృతినిధిక్క-
రించుఁదీరుననుండె ♦ రేయిబగలు

గీ. పాదసేవను జేసినఁ ♦ బరమసుఖము
లందఁదగుఁగాదెయిహాపర ♦ మందుఁగూడఁ
జేరిసుఖియింపకుండినఁ ♦ జింత లేల ?
బ్రదికియుండిన ఫలమేమి? ♦ పడఁతివీడి.

ఈపె పేరునకబలయయ్యు, నీనదీప్రవాహమునన చ్చెరువంద, నెంతయు నిపుణత వెల్లడించుచు, నావనడపుచున్నయది. నివాసమెయ్యదియో? ఈవనసీమయే కాపురమగునెడ, గుణరూపులును, మేటిజాతివారునగు నీపరిజనమును, జలధరములచేఁ గప్పఁబడియున్నఁ జంద్రునిచందంబున, నీపె లావణ్యము నిరర్థకమే కదా. జననీజనకులెవ్వరో ? ఈకాననమున నెచ్చోటఁగాంచినను నీబాలనుగనియుండునంతటి ధన్యులుండురని తోఁచకున్నది. (ఆలోచనన భినయించి) కాకున్న, నీపడఁతీరత్నమిటనుండుటకేమిహేతువు? ఈపెముఖపద్మమునం జూచినంతనే, చేపట్టిసుఖయించని, నాకీజన్మయేల యనిమనముతత్తరిల్లుచు, నెంతయోదార్పయత్నించినను నిష్ఫలమగుచుండె.

గీ. మదనుఁ డెంతయొ క్రూరుఁడై ♦ మదిపగలఁ జె
న్నొంది గోర్కుల తాపంబు ♦ హెచ్చఁజేసెఁ గాఁ
జేరి వేడిననువిదతాఁ ♦ జేరనియ్య
కొనును, లేక దూరున్ మదిఁ ♦ గూళ యనుచు.

ఏమైననుసరే, ఏసేగి, యుదంతమంతయు నెఱిఁగి మనోభీష్టమును దీర్చు
కొందును. (అనిసమీపించి, తనలో) ఏమని ప్రశ్నింతును ?
(ప్రకాశముగా) ఓసుందరాంగీ !

ఉ. ఎవ్వరిదాన వీవు కుల ♦ మెయ్యది? తెల్పవె మోహనాంగిరో
యిట్టి విరూపు మానిచరి ♦ యింపగ నేటికి? ధాతయాజ్ఞయో
యివ్వన వాసమే తలఁచ ♦ నింపుగఁ దోచెనో కాక యేలనీ
యౌవనమంతయున్ వృధగ ♦ నవ్వలఁ బుచ్చుట పాడి కాదుగా.

మ—(యించుక సిగ్గునభినయించును.)

శం—వనితా ! ప్రత్యుత్తరమీయక, సిగ్గునొందు నూటి వేల?

మ—అయ్యా ! ఏను పల్లెకులసంజాతను. సత్యవతియనుదానను. మ
త్స్యగంధియనియును, యోజనగంధియనియును నామములుకల
వు నాజనకుఁడు భోజనమునకుఁ బోవు వేళల, నీనావనునడుపు
చు, నాతనికిసాహాయ్యమొనర్చుచుందును.

శం—(తనలో) ఈ పెపల్కులకును, సౌందర్యమునకును జాలవ్యత్యా
సముగనున్నదే. తొలిఁ జేసినపాపమనుభవింప నిట్టికులమున
జన్మించియుండనోపు. లేకున్న బాల్యముననే, యాతనికిఁ జిక్కి
యుండుటను బట్టి, పెంచి పెద్దదానిగఁ జేసియుండవలెను. ఎటు
లైన నిక్కమునుగ్రహించెదనుగాక. (ప్రకాశముగా) ఓకన్య
కారత్నమా! నీజనకుని పేరేమి?

మ—దాశరాజందురు

శం—మీనివాసమిట కెంత దూరమునందుండును?

మ—ఈదాపుననే

శం—మీజనకునొకమాఱు చూపెదవా?

మ—బాటసారులనేకులు వచ్చెడువేళ నిచ్చోటును వీడిపోవుట్లురానే ర్తును? కొలదికాలమున నాతఁడేరాఁగలఁడు. ఆర్యా! తామెవ్వరో యడుగవచ్చునా? మాజనకునితోఁబనియేమి?

శం—నానామము శంతనుఁడందురు.

మ—(తలవంచి) మిమ్ములఁగూర్చి మాతండ్రి యెన్నిమాఱో తడవులునుడివియుండెను. మహారాజా! వేఱుగభావించితిరస్కరించినందులకు క్షమించెదరుగాక.

శం—ఇందుఁదిరస్కారమేమికలదు? తలిదండ్రులయొక్క యాజ్ఞకు బద్ధులైవర్తించుటయే బిడ్డలకువిధి.

మ—రాజా! సెలవొసంగుఁడు (అనియటనుండిపోవును.)

శం—మదనతాపమంతకంతకుఁ బ్రజ్వరిల్లఁజొచ్చెను. ఈనాతిని విడిచి యొక్కక్షణకాలమైన నసువుల భరియింపఁజాలను. ఏమిసేయుదును?

(అనితలఁచుచుండఁ బ్రవేశము:—దాశరాజు)

దా—రాజా! వందనము.

శం—శుభముచేకూరుచునుగాక. నీపేరేమి?

దా—(వినయముతో) దాశరాజందురు అయ్యా! ప్రజలకు రాజేదైవము. క్రూరమృగముల నెల్ల నుకాశి, యరణ్యవాసులచింతలఁబోఁద్రోల, నేతెంచి, యుపాయములఁ దొలఁగఁజేసిరి. మహాత్మా! మిమ్ములఁ గొనియాడ నేనెంతవాఁడను?

శం—రాజధర్మానుసారముగ వర్తింపనిందాశ్చర్యమేమి? సత్యవతి నీకన్నపుత్రికయేసుగునా?

దా—కాదు.

శం—(తనలో) నేననుకొనినట్లేయైనది. (ప్రకాశముగా) కాకున్న.

దా—ఒకానొకసమయమునఁ గొందఱుజాలరులు వేటకుఁబోవ నొక మత్స్యము వారికిఁజిక్కె. అదియు సాధారణపుచేపవలెఁగాక, మిగులఁ బెద్దదగుటఁ జేసి, కానుకగా నాకొసంగిరి. ఏనుదానిని జీల్చిచూడఁ, గర్భమున నొకపురుషుఁడును, నీవనితయుఁ గానవచ్చిరి. అనపత్యుఁడనగుటచేఁ గడుగారాబమునఁ బెంచుకొనుచు, నాపురుషుని మత్స్యదేశమునకు రాజుగఁజేసి, యీపెను నాయొద్దనేయుంచుకొంటిని. అందువలననే యీమెకు మత్స్యగంధియను పేరొసంగఁబడెను.

శం—పరిణయమాచరింపక, యింతకాల మొంటిగ నుపేక్షించితివి ?

దా—తగినవరుఁడు దొరకకుంటచే.

శం—(తనలో) ఏరీతినాసుందరిని నాకిమ్మనికోరువాఁడ? ఒకవేళయడిగిన నందులకొడంబడునో లేకుండునో? అయినడిగిచూచెదను గాక (ప్రకాశముగ)

క. తోయగంబునమించెను ♦ సుదతిసురల
సిద్ధసాధ్యకన్యకలను ♦ జేసిసుఖ
మందనిచ్ఛతోనుంటినే ♦ నవనిపాల
యార్తిఁదీర్పఁగ వేడెద ♦ నతివనొసఁగి.

దా— (ఆలోచననభినయించి యూరకుండును.)

శం—ఏమి? దాశరాజా! మాటాడక యూరకుంటివి? పరిణయమాచరింపనిష్టపడకుంటివా?

దా—వివాహమొనర్పక, యిఁకయు నెంతకాలముంచఁగలను. ఇప్పటికే చాల కాలయాపనమైనది.

శం—అయిన, నాకొసంగుట నీకయిష్టమా?

దా.—సకలైశ్వర్యములందులతూగుచు, రాజాధిరాజులగు, మీారలేవ
చ్చి బాలికనడుగుటచే నెంతయు ధన్యుండనైతిని.

శం.—అట్లయైననిఁక సంశయ మేమి? నీమనోభీష్టమును దెల్పుము.

దా.—తెలిపిన నందులకు సమ్మతింతురో? లేక యాగ్రహచిత్తులగుదు
రోయని, వెఱచుచున్నాడను.

శం.—అట్టిశంకనిసుమంతయు నెదఁదాల్పక త్వరితంబునఁ దెల్పుము.

దా.—రాజా! అట్లైనఁ జెప్పెదనాలకింపుఁడు.

చం. మదినొకచింతకలైవిను ♦ మానవనాథయభీష్టమున్ననీ
సుదతికిఁబుట్టుఁబుత్రునికి ♦ సోయగ మొప్పగ రాజ్యసంపదన్
పదపడియీాయగన్ దగిన ♦ బాసయొనర్పుముకన్యనిత్తునా
యెదఁగలకోర్కెతీరుగద ♦ యీార్ష్యలవేటికిసైపుమీాకృపన్.

శం.—(నిశ్చేష్టుఁడై నిలువఁబడును.) (కొంతవడికి) ఇంతకుఁబూర్వమే,
నాజ్యేష్ఠపుత్రుఁడగు, ధర్మపుత్రునకుఁ యౌవరాజ్యపట్టాభిషేక
మొనర్చితిని. అతనిఁద్రోసి యింకొకని రాజుగఁ జేయుటకెట్లలవ
డును? ధర్మవిరుద్ధముకాదా? పాలకుఁడే యన్యాయమునకొ
డంబడిననిఁక సామాన్యపునరులమాటఁ జెప్పనేటికి? ఇదితక్క
వేఱొండు వరము కోరుము. నీయిచ్ఛవచ్చినట్లు చేయుదును.

దా.—ఇదియేనాకోరిక. తదితరమేమియు నగత్యములేదు.

శం.—(చింతనొందుచు మదిని)

సీ. రమణినిజేపట్టి ♦ రతికేళిఁదేలెడు
భాగ్యమబ్బునటంచు ♦ భావమంది
సుందరాంగినిజేరి ♦ శోభఁగాంచెదుమహా
ఫలమెంతోయనియెదఁ ♦ బల్కుచుండి

పంకజాక్షిఁ బొంది ♦ పలు తెఱంగుల ముద్దు
ముచ్చటలాడుచు ♦ మురియ నెంచి
సుదతి నివరియించి ♦ సోయగ మేపార
నిరతము సుఖియించి ♦ నెనరుఁ గాంచ

గీ. నుంటి యీ యాశలన్ని యునడు ♦ గంటె నకట
యెట్టులోర్తును గతి యేమి? ♦ యింతి వీడి
యసువులవిపాయకుంచును ♦ యార్తిఁ దీర్చి
కాచు వారెవ్వరింక నా ♦ కాంత కన్న.

ఏమి సేయువాఁడ? ఇఁక నాకీపుట్టువునకు సౌఖ్యసంతసములు రెండునుగ అవయ్యెను. ఏల నాకీనాఁడీ వేటాడ నిచ్ఛవొడమెను? ఎందులకింత దూరము వెంటరిగి నే నెంచితిని? ఈసుందరీ దర్శన మేల కావలెను? ఎంతయు సంకటము గుచున్నది. నాకీతఁ డెదురాడి, యిట్లు ప్రతినఁ దాల్చునని, తొలుఁత నెఱుఁగఁజాలనైతినిగదా. హా! మదనా! నీకింక నుయీ పరిహాసము లేటికి? నీకును నాకును జాలదూరము. నాదతేఁ జేరకుము. ఏరీతిఁ బట్టణమునకుఁ దిరిగి పోఁగలను?

దా—రాజా! నెలవు నొసంగుఁడు. పోయివచ్చెదను.

(నిష్క్రమించును.)

(ఇంతలో సేవకులేతెంచి, శంతనునకు సేదఁదీర్ప మొదలిడుదురు)

శం—సేవకులారా! నేఁ డేకతంబుననో, కడుబడలిక కల్గినది. పట్టణాబునకుఁ బోవుదము లెండు.

సే—చిత్తము.

(అందఱును నిష్క్రమింతురు.)



శుభమస్తు. అవిఘ్నమస్తు.

## చతుర్థాంకము.

ప్రదేశము:—రాజభవనమున నొకచావడి.

ప్రవేశము:—ధర్మప్రియుఁడు.

ధ—ఆహా! ఇంతదనుక నెంతయున్మత్తుఁడనై యుంటిని. నాజనకుఁడు మొన్నటిదినమున మృగయావినోదార్థము యటవీస్థలికేఁగి, వచ్చినదాది సభామంటపమునకురాక యెల్లవేళలఁ జింతాక్రాంతుఁడై యెందువలననో శయ్యాగృహమును వీడకుండెనని యిప్పుడే సేవకుఁడు తెల్పియుండెను. మిత్త్రులఁగూడి, యితరచింతలులేక యాటలయందే నిమగ్నుఁడనైతిని. ప్రతిదినమును నన్నుఁబిలువనంపి కడుగారాబమున ముద్దుముచ్చటలాడు నాజనకుఁడీనడుమఁ జేరఁబిలువకుండుటకైనఁ గారణమరయనైతిని. ఏమియో, యత్యవసరమగు రాచకార్యములందుండి యుండుటచేఁ దీఱికలేకుండెనేమో యనితలఁచితిని. అట్లుకాక, వేఱొకరీతియయ్యెను. ఇఁకనైన జాగొనర్పక, యాతనికడకుఁ బోవుదుఁగాక (అనిపోవును.)

(తెరవాలును.)

## శయనగృహము.

ధ—(నిద్రించువానిరీతి నున్నఁదండ్రిని జేరి) నాయనా! నాయనా (అనిపిలచి పలుకకుంటఁ జేసి)

జనకా! మీరిట్లు దీర్ఘచింతాపరులై శయ్యనువదలక సొక్కుచుండుటకుఁ గతంబేమి? నన్నుఁగాంచినంతనే ప్రేమాతిరేకంబున దగ్గరకుఁజేరి ముద్దుఁగొనుచుండెడివాఁడవు. నేఁడిట్లు కినుకఁబూనుట కేనొనర్చిన యపరాధమేమి?

సీ. జనకుఁడన్నను దైవ ♦ సముఁడని మనమున
భక్తితోఁ గొల్చుచు ♦ బరగుచుంటి
ఎదనెంతదయఁబుచ్చి ♦ యాదరింతురో యంత
యణకువఁబూని నే ♦ నలరుచుంటి
వీక్షణంబున మిమ్ము ♦ వీక్షింపకుండునో
సకలంబు శూన్యమై ♦ సంస్మరించు
ఎగతాళికైనను ♦ నెదురునుత్తరమీయ
సాహసింపనుగద ♦ సచ్చరిత్ర
గీ. అట్టినాయందు నేఁడట్టి ♦ యలుకఁబూన
హేతువేమియొ తెల్పి నీ ♦ యిచ్చవచ్చి
నట్లుదండించి కృపఁజూడ ♦ నధికవినయ
బుద్ధి వేడెదఁగావవే ♦ పుత్రినింక.

శం—పుత్రికా! నీయందెన్నఁడైన నట్టి దోసముండునా?

దే—అట్లయిన నేనెంతయు ధన్యుఁడనైతిని.

ఉ. చేటగునంచు నెంచకను ♦ జేరగ నెంచిరొ శాత్రవుల్ యనిన్
పాటవమొప్పగన్ దునిమి ♦ భారముమాన్పదఁ బంపవే ననున్
యాటలనాడఁజూచిరొకొ ♦ యాసలఁజొచ్చియుఁ బోవఁజూచి యే
మాటున డాగియున్న నను ♦ మానము మానుము చంపితీరెదన్.

శం—నీవంటిశౌర్యపరాక్రమశాలి యగుసుతుఁడుండ నేరాజులుడాయ సాహసింతురు ?

దే—మతేకతమునవిట్లుంటిరో తెలుపవేఁడెదను. అంతవరకును నామది కలఁతనొందుచుండును.

శం—కుమారా ! నీవేకపుత్రుఁడవగుటచే నింకను సుతులఁగనబుద్ధిపొడమునది.

దే—నాయనా ! ఇంగులకింతగఁ జింతనొందనేల ? నిరుపమాన లావణ్యవతియు, సద్గుణాలంకారిణియు నగునొక కన్యకారత్నమును బరిణయమాడి నీయభీష్టమును దీర్చుకొనక యీవంత లేటికి ?

శం—(తనలో) ఏనేరీతిని నామనోభీష్ట మీతనికిఁ దెల్పుగాను ?, ఒకవేళ వెలిఁబుచ్చిన నొడంబడునా ? ఒడంబడినను మది నన్నెంత గదూరునో ? సదయహృదయుఁడును బితృసేవాపరతంత్రుఁడునగు నీతనిమదిఁ గల్తఁబుచ్చుటకంటె నేనిట్లు వ్యథనొందుచుఁ గాలమునుబుచ్చుటయే శ్రేయోదాయకము—

ధ—తండ్రీ ! ఏల ? ప్రత్యుత్తరమీయక యూరకుంటిరి ?

శం—పిమ్మటఁజెప్పెదను. సభాస్థలికేగి రాచకార్యముల మంత్రికి సాహాయమొనర్పుము.

ధ—(మనంబున) ఈతఁడెందువలననో తనమనోభీష్టమును నెఱింగింప శంకించుచున్నవాఁడు. ఎంత వేడినను నిష్ఫలమగుచున్నది. ఈ విషయ మేమైన మంత్రిపుంగవునికిఁ దెలిసియుండెనేమో ? పోయి యరసెదను. (నిష్క్రమించును)

(యవనిక జారును)

---

## ద్వితీయరంగము—సభామంటపము.

(మంత్రియు, మఱికొందఱుద్యోగులునుండ)

ప్రవేశము:—ధర్మవ్రతుఁడు

మం.—యువరాజా! అభివందనము.

ధ—(ఉచితాసనాసీనుఁడై) మంత్రిశేఖరా! మజ్జనకుం డగుశంతను మహారాజు సభాస్థలికి రాక చింతాక్రాంతుఁడై యెల్లవేళల శయనించియుండుటవిని తత్తరంబునఁబోయి యెన్నివిధములఁ బ్రార్థించినను గారణమును జెప్పకుండెను. అందుచే నాకిసుమంతయు శాంతి కల్గుటలేదు. అందులకుఁగల హేతు వేమియొ తెలిసియున్న సత్వరబునఁ దెల్పుము.

మం—యువరాజా! తొలుత నేనును గ్రహింపనేరక తర్కవితర్కంబులకు లోనై యావాఁడాయనఁగూడి వేటకేగిన సేవకుల విచారింప వెల్లడియైనది. అది నీకుఁజెప్పిన నెట్టి కాఠిన్యమునుబూనెదవో యని నీజనకుఁడు తెలుపకుండెనుగాఁబోలును.

ధ—ఏమి? ఆతనియాజ్ఞానుసారముగవర్తించి మెప్పువడయుటకుమారుఁగఁ గినుకఁబూనునంతటికృతఘ్నుఁడనా?

మం—అట్టివాఁడవు కావని యెల్లరెఱుంగుదురు. ఆజన్యుఁడు వేట సాగించి దప్పికకై యమునానదికిఁబోవ నచ్చోట నొక కాంతారత్న మాతనికంటఁబడెను. ఆమెనువరింపనిశ్చయించి యాపెజనకుం డగు దాశరాజుకడకేగి యడుగ నావనితయందాయనకుదయించిన వానికి రాజ్యాధికారమొసంగిన నిచ్చెదనని నుడివెనఁట. అందుచే నేమియును దోపక యావనితామోహముసదగుల్కొని విరహవేదనాభివర్ధనుండైయుండెను.

ధ— (సవ్యాజము) ఇదియేనా! నాజనకుని సంతాపమునకుఁ గారణము. అప్పుడే యాదాశరాజు మనంబును ప్రీతిపఱిచి తనకోర్కెను సఫలముఁ జేసికొనిన నేను వేఱుగ భావింతునా ?

గీ. తండ్రికోర్కెను దీర్పని ♦ తనయుఁడున్నఁ
బరిమళము లేనిపువ్వుంబు ♦ పగిదియిలను
వ్యర్థమగుఁగాదె తనువేల ? ♦ వాంఛ లేల ?
జన్మమెత్తినఫలమేమి ♦ జడునిభంగి.

కావున మనమీదినముననే బయలువెడలి యాయరణ్యమునకేగి దాశరాజునొడంబఱిచి యాపెను దోడ్కొనివచ్చి మాతండ్రియభీష్టమును నెరవేర్చుదము.

మం—(తనలో) పితృభక్తియన నిదియేకదా. తనజనకునిమెప్పింపఁ దనకుఁ జెందఁదగు రాజ్యాధికారమును నేఁడే వీడుట కుద్యుక్తుఁడయ్యెను. భూలోకంబున నిరంతర మీతనినామము వరలుచుండుననుట నిక్కము. ఇట్టిపుత్రులఁగనిన జననీజనకుల పుణ్యమనంతముకదా! (ప్రకాశముగా) యువరాజా! మీయిష్టానుసారము నేఁడేపోయివత్తము. సభ చాలింతమా ?

ధ—మంచిది. (అందరును నిష్క్రమింతురు)

---

## తృతీయరంగము

---

దాశరాజుగృహము

దా—నాముద్దుపట్టి నీయకుంటినని శంతనుఁ డెంతయలిగియుండెనో ? అయిననేమిసేయువాఁడ ? ఎట్లైన నాతనికీయుటయే ముఖ్య

ము. తండ్రికోర్కెనుదెలిసికొనిన ధర్మవ్రతుఁడూరకుండునా?
ఇంతకును భగవదాజ్ఞ యెటులుండెనో ?

గీ. యత్నమొనరింపఁదగుఁగాని ♦ యాచరింప
వశమె ? మానవులకునెందు ♦ వాసుదేవు
తోడుకల్గినసమకూరు ♦ దుర్ఘటంబి
దియని తలపోయఁ బనినే ♦ దియును లేదు.

(సేవకుఁడు ప్రవేశించి) అయ్యా శంతనమహారాజుగారి పుత్త్రుఁడగు దేవవ్రతుఁడనునాతఁడు మంత్రిమొదలగువారినిగూడి దర్శనార్థమేతెంచెను.

(దాశరాజెదుతేగి తోడ్కొనివచ్చి సన్మానించి)

దా చ. కుశలమెరాజపుత్త్ర! జన ♦ కుండును క్షేమమె? పాలితుల్సదా
వశమునఁనున్నవారుకద ♦ భారము రాజ్యము పాలనంబునన్
కుశలతయొప్పనేలఁ దగుఁ గోపముఁజూపి

ధ—అందఱును క్షేమంబుగనున్నవారలు. పాలనమున నెట్టికొ[illegible]లునులేక నిరాఘాటముగ జరుగుచున్నది. మేమొక కార్యార్థమేతెంచియుంటిమి.

దా—అదేమియొ వేగమునఁదెల్పి నన్నుఁ గృతార్థుఁ జేయ వేఁడెదను.

ధ- సీ. వేటకైచనుదెంచి ♦ వింధ్యాటవిం జేరి
కాంచె నాజనకుఁడు ♦ కాంత నొకతె

దా— వినియుంటి నాపెయే ♦ వెలఁదిసత్యవతియు
నాకుముద్దులపట్టి ♦ న్యాయశీల

ధ— శంకనొందెద వేల ? ♦ శంతనుఁడంతటి
రాజరాజేంద్రుఁడు ♦ రమణిఁగోర

దా— పడఁతికిఁగల్గినఁ ♦ బట్టికి రాజ్యంబుఁ
గట్టనెంచిన నెట్టిశం ♦ కలును లేవు

ధ— గీ. సంశయింపకు దాశరా ♦ జన్య వినుము
యెవఁడుజనియించునాపెకు ♦ నిలనునేలు
నట్టిజగదీశుఁడైయొప్పు ♦ ననవరతము
వలదురాజ్యంబునాకును ♦ వసుమతీంద్ర.

దా—నీపితృభక్తియెంతయు శోచనీయము. ఎంతయు నౌదార్యవంతుఁడవుకదా. అయిన నొక్క సంశయము మాత్రము మదిని గలంచుచున్నది.—

ధ—ఏమది ?

దా—ఈవు నిత్యసత్యవ్రతుఁడనగుటచే నీవాడినమాటను జవదాటవని నమ్మఁగలదు. కాని, నీకుజనించుఁబుత్రు లంతటిబుద్ధిశాలురగుదురని యెట్లునమ్మఁగలము?

ధ—అట్లయినవినుము. భూమ్యాకాశములును, సకలదేవతలును సాక్షులు కాగాఁ బ్రతిజ్ఞనొనర్చుచుంటిని.

చ. జనకునికోర్కెనెంచిమది ♦ జన్మముపావనమొందునట్లు లీ
జనపతులెల్లరున్వినఁగ ♦ సత్యముపల్కెద దాశరాజ నే
ననవరతంబుదల్పగల ♦ నైననుబెండిలియాడఁ దప్పినన్
కనికరమింతలేక యుప ♦ కారినిజంపినఁ బాపమొందెదన్.

(ఎల్లరాశ్చర్యనిమగ్నులగుదురు. దేవతలుపుష్పవర్షమునుగురిపింతురు.)
భీష్మప్రతిజ్ఞ నొనర్చెనుగాన భీష్ముఁడనుపేరను బరఁగుఁగాత.
(అశరీరవాక్కు వినఁబడును)

దా—ఆహా ! ఏమి నీకృతజ్ఞత. ఇఁకఁదడవేల ? నాపుత్రిక నెంతయుఁ బ్రీతితో నొసంగెదను.

ద—మేమిప్పుడే తరలిపోయెదము.

దా—అయ్యా! నాయందనురక్తులై నేటిదినమున మాత్రమిచటనునిచి, నన్నుఁ బావనునిగఁ జేయఁ బ్రార్థించుచున్నాఁడను.

ధ—ఇంతులకింతగ వేడనేల? నేటికిచటనే గడపెదము.

(యవనికజారును)

(అంతఃపురమున సత్యవతి, దాశరాజు)

స—జనకా! నేఁడేలకో మిమ్ములనుగాంచ నించుక విచారముననున్నట్లు సూచించుచున్నది.

దా—తల్లీ! చిన్ననాఁటనుండియు నిన్నుఁగడునాదరముతోఁ బెంచి, యింతదనుక నొక్కక్షణకాలమైన విడనాడి యుండకపోవుటచే నిఁకముందెట్లు కాలముబుచ్చనగునోయని చింతిలుచున్నాఁడను.

స—(తండ్రిపలుకులఁగ్రహించి తలవంచియూరకుండును.)

దా—అమ్మా! శంతనుమహారాజునుఁ గాంచియుంటివికదా!

స—(సిగ్గునభినయించుచు) చూచితిని.

దా—ఆతఁడెల్లవిధుల నీకుఁదగినవరుఁడని, తలఁచి, నిన్నాతనికొసంగి పరిణయమాచరింప నిశ్చయించితిని. ఆతనికి దేవవ్రతుఁడను నొకపుత్రుఁడు కలఁడు. కాని నీయందుద్భవించిన వానికిరాజ్యము నంగునట్లు శపథమొనర్చినారా! తల్లీ! యెల్లవేళల సదయహృదయవై వర్తించుచుఁ బుట్టినింటికిని, యత్తింటికిని, పేరుప్రతిష్ఠలఁ దేవలెను. నీకుఁ దెలియనినీతులుకలవా? అయినను నాకు విధికృతమగుటచేఁ దెల్పితిని

స—(కన్నులనీరునింపుచు) నాయనా! అటులనే వర్తింతును. మిమ్ముల నెట్లుపాయనోపుదును? తండ్రీ! దూరమందున్నను, మఱువకుందువుగాకయని కోరుచుంటిని.



శుభమస్తు అవిఘ్నమస్తు.

# భీష్మప్రతిజ్ఞ.



## పంచమాంకము.

ప్రదేశము:—కేళీగృహము.

ప్రవేశము:—శంతనుఁడు, మత్స్యగంధి.

శం—(మత్స్యగంధిహస్తమును బట్టుకొని) కాంతా! జనకునిసుఖమే తనకు సుఖకరమనియు, జనకునియాహ్లాదమే తనకాహ్లాదకరమని నెంచి యిహలోకసౌఖ్యములకెల్ల నాటపట్టగు పరిణయమును వీడి, రానున్న రాజ్యాధికారము నించుకయు లెక్కింపక, చేతులారఁ బోగొట్టుకొని, బ్రహ్మచర్యవ్రతమును బూనిన మదీయతనయుని సద్గుణపరంపరలచేత నేకదా నిన్నుఁ జేఁబట్టి సుఖించు భాగ్యము లభించెను. అందువలన నే యాతనికి భీష్ముఁడనియెడు బిరుదాంకితమును మృత్యు వాతని స్వాధీనమున నుండునట్లును వరంబు లీయఁబడెను.

గీ. కలదొకో జగంబునం దిట్టి ♦ కరుణయుండు
జనకుకై బ్రహ్మచర్యంబుఁ ♦ దానుబూని
చేతనున్నట్టిరాజ్యమే ♦ చింతలేక
పోవిడచియవంతఖ్యాతి ♦ బొందుటరయ.

నీజనకుఁడెట్టికఠినహృదయుఁడు. తనంతటఁ దాను వలచివచ్చిన నెంద్రైన నవమానము ఘటించుననుటనిక్కము.

మ.——నాథా! కఠినాత్ముఁడని యాతని దూషించిన నేమిఫలము? పుత్రిక ల శ్రేయముఁగోరని పురుషులుందురా ?

శం——ప్రేమయుండిన నుండవచ్చును. కాని యిట్టియసాధ్యమగుఁ గోర్కెలఁ గోరుటయా ? ఒకవేళ నాపుత్రుఁ డిందులకొడంబడకున్న నీయందుండెడు ప్రేమాతిరేకంబునఁ గుందుచుఁ దుదకు నామమాత్రావశిష్టుఁడనగుటయే కర్తవ్యమైయుండునుగదా.

స——పాపము శమించునుగాక. ఈయమంగళపువాక్కు లేల?

గీ. సుఖము నైననుమతియెట్టి ♦ దుఃఖమైన
ననుభవింపక చెల్లునే ♦ యాదిదేవుఁ
డంతవాఁడైన బ్రాణేశ ♦ యవనిబుట్టు
టరయఁగర్మననుభవింప ♦ నగునుగాదె.

ఇదియుఁగాక జరగినవాటికి యాలోచన లేల?

శం——ప్రేయసీ! తాకినంతనే కందునేమోయని శంకవొడమెడు నీయామృదుకరంబుల నావలనెట్లునడపఁజాలితివో కదా. రమణీయంబగునట్టి సౌధోపరిభాగముల వసియింపఁజాలు నీవా ఘోరారణ్యముల నెట్లుసంచరించితివి? చిలుకపలుకులకే యదలిపడునంతటి కోమలహృదయ వేరితిఁ గ్రూరమృగారావంబులఁ జెవిదాల్పనోపితివి ? చూచితివా ? అవన్నియు నేఁడు కలలోనివార్తలయ్యెనుకదా.

మ——ప్రాణేశ్వరా! మిముఁబోలు రాజాధిరాజులఁ గూడు భాగ్యములభింపనేమికొఱఁతలుండును ?

సీ. కఠినంపుఠానేల ♦ గలకాననంబులు
ఉద్యానవనములై ♦ యువిదకమరె
కాంతారవాసంబు ♦ కలలోనివార్తయై
రతనంపుసౌధముల్ ♦ రమణికమరె

యౌవనవతియయ్యె ♦ నానందమెఱుఁగని
పడఁతినాథునిఁజేరు ♦ భాగ్యమమర
దినమొకయుగముగ ♦ దీనత్వమునఁబుచ్చుఁ
గాలగమనమెంతో ♦ కలిగెనేఁడు

గీ. ఇట్టిసౌభాగ్యగరిమంబు ♦ నెన్నవశమె
నన్నుఁబోలెదుధన్యు లెం ♦ దైనఁగలరె
కోరుచుంటెనినిన్నాళ్లుఁ ♦ గూడనెంతో
కనినదాదిగరాజేంద్ర ♦ కాననమున.

శం—నీయభీష్టమును నీజకున కెఱింగించితివా?

మ—ఆతఁడే ముందుగ నీయుదంతమంతయుఁ దెల్పెను.

సం—తపస్వీ! మోహమనుపదార్థ మెంతటిబుద్ధికుశలురనైనను నెక్కుడుకాలమున బుద్ధిహీనునిగ నొనర్చునుగదా.

సీ. కన్నపుత్రునిఁబట్టె ♦ కడుపంగరానట్టి
కష్టముల్ గూర్చునీ ♦ కతనఁగాదె
జనకుఁడునిర్దయ ♦ స్వాంతమందునఁభూనె
సతికంచునిందనీ ♦ కతనఁగాదె
మోహవారిధిమున్గి ♦ మోమెత్తఁజాలక
సతతంబుచింతనీ ♦ కతనగాదె
పరచింతమదినెంచఁ ♦ బాపంబునైనను
గలతలేకుండెనీ ♦ కతనగాదె

గీ. ఎన్నశక్యంబెస్త్రీవాంఛ ♦ నెట్టిధీరుఁ
డైనమోహమనగనొప్పు ♦ ననలమందుఁ
బడి కూఁలబై పడఁజాలునె ♦ భక్తిభీతి
తొలఁగుమహిమంబదెంతయొ ♦ తోయజాక్షి.

శత్రువునకైన నిట్టియిడుములు ప్రాప్తింపవలదు.

మ—పురుషులీరీతిఁ దలఁచుచుందురు. వనితలెట్లు చింతిలుచుందురో తలఁచవలదా!

శం—తొల్లి యెల్లవేళలఁదపంబాచరించుచు వనములసంచరించు ఋషులెందఱు మోహమునఁ దగుల్కొని తపఃఫలములఁ బోఁగొట్టుకొనిరి. అంతకును భగవన్మాయఁ దెలియవశమగునా?

---

ద్వితీయరంగము—పురవీధి.

---

ప్రవేశము—(రామావధానులు, వెంకటశాస్త్రి.)

రా—ఓహో! వెంకటశాస్త్రిగారా! ఎన్నిదినములకు దర్శనము? ఈనడుమ నూరలేరా?

వెం—యాత్రార్థముపోయి నిన్నటిదినముననే తిరిగివచ్చితిని. విశేషము లేమియుఁ దెలుపరా?

రా—నేఁడు రాజుగారి ద్వితీయపుత్రుఁడగు విచిత్రవీర్యుఁడు పుట్టినదినము అందుచేఁ దొందరగఁబోవుచుంటిని. పిమ్మటసావకాశముగ మాట్లాడుకొనఁదగును. మీరునువచ్చెదరా?

వెం—వచ్చెదను. కాని, రాజుగారికి యీనడుమ శరీర మస్వస్థగనున్నదనివినియుంటిని. మీరుపలుమరచ్చోటుకుఁ బోవుచుందురు. ఎట్లున్నది?

రా—(రహస్యముగ) దిన దినము క్షీణింపుచుండుటయే కాని యెన్నిమందులొసంగినను వృథయగుచున్నవి. ధనముకై యాసించి పోవుటయేకాని వైద్యులెవరును నిర్ధారణఁ జేయఁజాలకున్నారు.

వెం.—పిదప రాజ్యమునకుఁ గలఁతలు సంభవించునుగాఁబోలును.

రా.—కలఁత లెందులకు?

వెం.—భీష్ముఁడు యువరాజుకదా!

రా.—అయిన?

వెం.—రాజ్యార్హత యాతనిది కాదా?

రా.—మీకేవెఱ్ఱియేల? తాను నిత్యము బ్రహ్మచర్యమున నుండెదనని ప్రతినఁబూనినవాఁడు నేఁడు తిరుగ రాజ్యము పేక్షించునా? కావునఁ జిత్రాంగదుఁడే రాజు కాఁగలఁడు.

వెం.—శంతనుఁడున్న నెట్టిశంకయునుండదు. ఆతని వెనుక నెట్టివింతలు పుట్టునో యనియాంటిని.

రా.—ఎన్నఁడట్లు తలఁచ నగత్యము లేదు. ఆమహానుభావునకీ రాజ్యమేల?

వెం.—రాజుగారు రుగ్మతతోనుండ నీయుత్సవ మేటికి?

రా.—ఆయనయే యొనర్పుమని నుడువుటచేఁ జేయఁగడంగిరి.

వెం.—శంతనుని తనయులింకను బిన్నవయస్కులుకదా! రాజ్యార్హత యెట్లు?

రా.—అంతదనుక భీష్ముఁడే రాచకార్యములఁ జక్కపర్చును.

---

## తృతీయరంగము

---

ప్రవేశము:—భీష్ముఁడు.

భీ.—(విచారముతో) కటకటా! నేఁడెట్టిదుర్దినము. నిరతముఁబంచప్రాణములు నాపైనిలిపి గారాబమునఁ గాంచునట్టి జనకుఁడు ప్రజలఁ గన్నఁ బిడ్డలభాతిఁజూచుచు నెట్టిచింతలును గలుగనీయక

కాపాడునట్టి సదయహృదయుండగు మహారాజు దుఃఖములతో టపట్టగు నిహలోకమునువీడి స్వర్గసౌఖ్యమునుగోరి వెడలెనో యనునట్లు పరమపదవి నధిష్ఠింపఁజనెను. హా! జనకా! ఎవ్వరింత ముద్దుపల్కులనన్నుఁ జేరఁదీసి ముచ్చట లాడుదురు ? కుమారా ' యని నోరూరఁ బిల్చువారెవ్వరు? తండ్రి! మమ్ము లవిడనాడిపోవుటకు మేమాచరించినయపరాధమేమి? నాసోదరులింకను జిఱుతప్రాయమువారే. ఈరాజ్యభార మెవ్వరివశ మొనర్చిపోతివి ?

సీ. తనయు డరమ్మంచు ♦ దరిఁ జేరఁ బిలిచియు
నాదరంబునబుద్ధి ♦ సరయునెవరు?
కన్న (బుత్రు)లఁగాంచి ♦ కౌఁగిటకుం జేర్చి
ముద్దాడమక్కువఁ ♦ బుచ్చునెవరు?
సంతతంబుఁ జేర్మిలో ♦ సభఁ జేరఁబోవుచుఁ
దోడురమ్మంచును ♦ నడుగునెవరు ?
పదపడిచూడక ♦ ప్రిదిదినముననన్నుఁ
గాలముపోదంచుఁ ♦ గడగునెవరు ?

గీ. అట్టిజనకుని ననఘుని ♦ నాత్మబంధు
వీడిమొట్టులవర్తింతు ♦ వినుతగుణుఁడు
సకలసౌభాగ్యగరిమంబు ♦ సమసిపోయె
దైవమీరీతిఁ జేసెను ♦ తాళుటెట్లు ?

(ప్రవేశము:—మంత్రి))

మం—యువరాజా! మీరలేయిట్లుమూఢునిభంగి, చింతిలుచుండిన నింకేమి తెరువు ? ప్రతిజీవియు, నీమాయాలోకము నుద్భవించి నదనినఁ గిట్టుటకూడ వెనువెంటనేయుండునని తలఁచవలదా ?

కాన నిఁక నావిచారమునుదక్కి ముందుజరుగవలసిన విధాన మరయుఁడు.

భీ—ఇప్పుడు తర్కింపవలసినంత కార్యము లేవికలవు ?

మం—(సంశయాకులాత్ముఁడై) రాచ కార్యములఁ జక్కఁబఱుప

భీ—అందుసంశయమేమి? నాసోదరుండగుఁ జితాంగదుఁడేరాజగుట నిశ్చయము. కాని, యాతఁడింకను లేఁబ్రాయముననుండుటచే నాతనికిమాఱుగ నేనేనడుపుచుందును. మంత్రిసత్తమా !

గీ. వసుధయనగనుబరఁగెడు ♦ వార్ధియందు
జనకుఁడనియెడునావదా ♦ సమసిపోయె
నెట్టుదఱిఁ జేరనగునొయే ♦ యిడుమలంద
నిల్చియున్నవో జీవముల్ ♦ నిశ్చలముగ.

మం—ఆర్యా! తలఁచినకొలఁదిని దుఃఖమతిశయించుచుండును. జననీ జనకులఁబోలుపదార్థములఁ బాసినఁ దిరుగదర్శింపఁజాలముకదా!





శుభమస్తు అవిఘ్నమస్తు.

# భీష్మప్రతిజ్ఞ

## షష్ఠమాంకము.

### అంతఃపురము

ప్రవేశము:— మత్స్యగంధి, భీష్ముఁడు

మ— తనయా! చిత్రాంగదుండెంతయు నున్మత్తుఁడై గర్వాతిశయంబులఁ దలపడుచున్నాఁడని పలువురు సేవకులచే వినియుంటిని. ఏమి సేయుదానను? ఏనాఁడెట్టికీడు మూడునోయని భయమగుచున్నది. ఎల్లవేళల రణమునకే సిద్ధపడుచుండును. ఏమైనను నీయదే భారము.

భీ— (తలవంచి యున్నవాఁడై యూరకుండును.)

మ— పుత్రకా! ఏమి పలుకకుంటివి?

గీ. అలుకఁ బూనితివో లేక ♦ యక్రమంబ
నకను రాజగుసోదరుఁ ♦ డాగ్రహమున
నెట్టి యపచారమైనను ♦ బట్టదలను
యాచరించెనో తెల్పవే ♦ యనఘచరిత.

భీ— (కన్నులఁ దడిపెట్టుచు) ఏమని తెల్పువాఁడ తల్లీ! ఎన్ని విధములతో

ధన జేసినను బెడచెవి బెట్టి చిత్రాంగదుఁడు చిత్రాంగదుఁడను గంధర్వునితోఁ గయ్యంబునకుఁ దలపడ వెడలెను.

మ—ఎందువలననో యాందోళన మెక్కుడగుచున్నది. నీమాటనుజవ దాటుటచే నీకిట్టిచింతకలిగియుండెనుగాఁబోలును.

భీ—నాకట్టివిచారణమెన్నఁడును గలుగదని నొక్కి వక్కాణింపఁగలను.

మ—మత్తేమైనది ?

భీ—(తనలో) ఎట్లీవార్తను దెలియఁజేసి యోదార్పువాఁడ ? (ప్రకాశముగా) ఇంతకుఁబూర్వమే యొకసేవకుఁడేతెంచి మనచిత్రాంగదుఁడు యాగంధర్వునిచేమడిసెనని తెల్పియుండెను.

మ—హా ! పుత్రా ! (అనిమూర్ఛనొందును.)

భీ—అయ్యో ! ఈపె మూర్ఛనుమునింగినది.

(అని శైత్యోపచారంబులొనర్చు)

మ—(మూర్ఛఁదేఱి)

సీ. కాంతునిబాసియుఁ ♦ గన్నపుత్రులఁగాంచి
యసువులవీడక ♦ యలరుచుంటి
నాథుఁడులేని య ♦ నాథనయ్యును మేను
సౌఖ్యమునియుంటి ♦ సుతులఁజూచి
ప్రాణేశువీడినఁ ♦ బాతకినయ్యును
తనయులుండుటచేత ♦ ధరణినుంటి
ప్రియునెడబాసియుఁ ♦ బ్రేతరూపముదాల్చి
బాలురుండుటవల్ల ♦ బ్రతికియుంటి

గీ. అందునొకఁడేగెదివిఁజేర ♦ ననఘుయిప్డు
నిలిచియున్నట్టిజీవముల్ ♦ నిలుచుటెట్లు
కఠినపాషాణహృదయనై ♦ కనులఁగాంచి
తాళియుంటిని యక్కటా ♦ తనువుతోడ.

హా! సుతా! ఎన్నిసారు లకారణశత్రుత్వమునకుఁ బాల్పడవలద ని బ్రతిమాలినను వినవైతివిగా! మృత్యువువాతఁబడనున్న వేళ దైవమాహితముఁ జెప్పెడివారే శత్రురూపమున గన్పట్టుదురు కాఁబోలును! హా! ఏనెంతపాపాత్మురాలనో కదా! ఆపాపముల నుభవింపఁ జేయుట కిదియా! దారి వెతకితివి? అయ్యో! యీజీ వములిక నైనవిడనాడిపోకుండునే?

భీ—అమ్మా! మీరిట్లు చింతిలుట తగునా ? ఎంతకాలము చెంతనుందురో యంతవఱకే మనకునువారికిని సంబంధము. ఇదంతయుఁ బ్రకృతిస్వరూపము. వారివారి కర్మానురూపఫలమనుభవింప జన్మలందుచుఁ గిట్టుచుందురు. మనముమాత్రము శాశ్వతముగ నిట వాసముచేయుదమా ?

మ—నాయనా! కడుపునబుట్టిన వాఁడెట్టివాఁడైన జననీజనకులకుఁ బ్రేమతొలఁగునా ? నీ జనకుని కోర్కెననుసరించి శపథమొనర్చి రాజ్యమొసంగితివి. కాని పాలించుట కర్హతవలనా ?

భీ—జననీ ! యూరడిల్లుము. నాద్వితీయసోదరుఁడు విచిత్రవీర్యుఁడే యింతటినుండి రాజు కాఁగలఁడు. మిగిలియున్న నాతనినేచూచుకొని సంతసింపుము.

మ—అదృష్టహీనుల కెందైన శుభములొనఁ గూడునా? సుఖములైనను కష్టములైనను వరుసను గల్గుచుండును.

భీ—అమ్మా ! ఏనేగి విచిత్రవీర్యునికిఁ బట్టాభిషేకమొనర్పఁదగు యత్నములు కావింపవలెను. ఆలసింపరాదు. రాజులేనిరాష్ట్రమంతయునల్లకల్లోలముగ నుండును.

మ—మంచిది పొమ్ము. ఈతఁడెట్లువర్తించునో ? దేవాదిదేవా !

సీ. కావవే ప్రహ్లాదుఁ ♦ గమలాక్షయని వేడ
దాక్షిణ్యమునుజూపి ♦ ధర్మచరిత

బోవవే పాంచాలి ♦ భువినీవెదిక్కనఁ
గనికరంబునుజూపి ♦ కమలనయన
రక్షింపగాలేదె ♦ రాముండవైపుట్టి
కలఁతనొందెడుముని ♦ గణములెల్లఁ
గాపాడగాలేదె ♦ కాపుమంచును వేడఁ
గరినిబాధనుమాన్ప ♦ కరుణతోడ

గీ. అట్టిధర్మాత్ముఁడవునేఁడు ♦ యక్కటకట
ఎంతవేడినదయఁజేర ♦ నెంచవేమొ
నాదుచింతలనెడబాపి ♦ వన్నుఁగావ
నీవుకాకికయెవ్వరు ♦ నిర్మలాత్మ.

భ—అమ్మా! చెప్పమఱచితిని. ఈనడుమఁ గాశీరాజుపుత్రికలకు స్వయంవరముజరుగుననియు, నీభూలోకంబునఁ గల రాజులందఱు తత్కౌతూహలంబుననటకుఁబోయియుండిరనియు, వినియుంటిని. మనవిచిత్రవీర్యుఁడును, సంప్రాప్తయౌవనుఁడయ్యెను. కాన నేనునుబోయి, యారాజన్యులనెల్ల జయించి, యాకన్యకలను దోడ్కొనివచ్చి, పరిణయమాచరింపనుద్దేశించితిని. ఇందుమీయభిప్రాయమును దెలుపవేడెదను.

మ—కుమారా! అన్నివిధముల నిన్నేనమ్మియున్నదానను. నీయిష్టమువచ్చినట్లొనర్పుము. అదియే నాకును బ్రియంబు.

(భీష్ముఁడు నిష్క్రమించును.)

(తెరపడును)

---

## ద్వితీయ రంగము

---

(తెరలో)

(భీకరముతో భీష్ముఁడు)

చం. కదనమునందుసాళ్వపతి ♦ గాసిలినొందెనుశక్తియున్న మీ
మదములఁజూపరండు పలు ♦ మాటల వేటికికన్యకావళిన్
ముదముతొ వెంటఁదోడ్కొనిమె ♦ పోవుచునుండెనుధీరులున్న మీ
వదనము లేలదాచెదరు ♦ ధీరుఁడనంచును భీష్ముఁడిప్పుడే.

ప్రవేశము:—భీష్ముఁడు; అంబ, అంబికాంబాలికలు.

భీ—ఓవనితలారా! రాజధర్మానుసారముగ భూపతులనెల్లర గెల్చి, మిమ్ముదోడ్కొనివచ్చితిని. మీముమ్వురనాసోదరుఁను, రాజ్యాధిపతియునగు, విచిత్రవీర్యునకొసంగి పరిణయమాచరింపనుద్దేశించితిని. అందుల మీకెట్టిసంశయముంన్నను, దాచక నాతోడనే వెలిఁబుచ్చుఁడు.

(అంబికాంబాలికలు నిరుత్తరలై యంగీకారమును సూచింతురు)

అం—ఆర్యా! నామదినొకకోర్కెకలదు, దానిఁదీర్పఁ బ్రార్థించుచున్నదాఁనను.

భీ—అదేమి?

గీ. ఎదనుసాళ్వునివరియింప ♦ నిచ్ఛనుంటి
వరునిగోరుటకెంచను ♦ పతితచరిత
ధర్మమంచునుదోచినఁ ♦ దరలిపోవ
నాజ్ఞనొసఁగుముపోదునే ♦ నాసఁ జేసి.

భీ—ఇదియేనానీకోరిక?

అం—అగును.

భీ—నీక భీమతమగుఁగార్యమున కేనాటంక పఱుప నేల? అటులనే పోవచ్చును.

అం—(తనలో) ఆహా! యీతనిదయాస్వభావ మేమనవచ్చును? అందువలననే ధర్మవ్రతుఁడను నామమునఁ బిలుఁగుచుండెదరు. ఈతఁడొడంబడకున్న, నాకీలోకమున సంతసమే శూన్యమైయుండును గదా.

ప్రవేశము—మంత్రి.

భీ—మంత్రిశేఖరా! వీరిముగ్వురిలోను పెద్దయగు నీయంబ తాను సాళ్వభూపతిని జేపట్ట మదినెంచియుంటిననియు నాతనికడకుఁ జేర్పుమనియుఁ గోర నందుల కియ్యకొంటిని. కాన, నీవీమె దేశము నధిష్ఠింపఁజేసి పనుపుము.

మం—చిత్తము.

భీష్మ—పిమ్మట శుభముహూర్తమున నీ యిరువురను విచిత్రవీర్యున కిచ్చి, వివాహ మొనర్పవలెను. తగుసన్నాహ మొనర్పుము. నేటిదినముననే పురమంతయు నలంకరింప నాజ్ఞాపించి యివ్వార్త నలువంకలఁ జాటఁబంపుము.

మం—ఎంతయు నానందమొదవె. ఆజ్ఞకుబద్ధుఁడను. ఆర్యా! అచ్చోట జరగిన వింతలేమి?

భీష్మ—ఈ భువిగలరాజులెల్లనటకేతెంచి, యీకన్యకలను జేపట్టఁగుతూహలమున నుండి సభామంటపమును జేరినవేళ నేనునుబోతిని. రాజులు పరిణయమాడుట కనేకమార్గములు కలవు.

గీ. మంత్రిశేఖర! విను ముందు ♦ మానవతులఁ
బట్టుటరయఁగ నొప్పగుఁ ♦ బాలకులకు

రాక్షసంబున నందుచే ♦ రాజులెల్ల
భీతిఁ జెందంగనోడించి ♦ పెద్దనైతి.

స్వయంవరమున వరించుటకు విచిత్రవీర్యుఁడు దగిలేకుండుట చే రాక్షసవిధినందఱఁ గెలిచి, తోడ్కొనివచ్చితిని. సాళ్వపతి, యెన్నియోరీతుల శక్తివంచనలేక, పోరాడి తుదకోడి, వెనుక కుమరలెను. కాని, యీబిడ కోరుటచే నామెను వీడితిని.

మం—సదయహృదయులుకదా.

(ప్రవేశము:—విచిత్రవీర్యుఁడు)

వి—సోదరా! వందనము. సోదరా! సౌజన్యనిధీ! మీసహాయముండుటచే,

గీ. శత్రురాజులుచేరరు ♦ సచ్చరిత్ర
సుష్టవర్తనులున్నట్లు ♦ తోఁపదయ్యె
కలహముల్ లేవుప్రజలలోఁ ♦ గాంచనయ్యె
సంతసాంబుధిఁదేలెదు ♦ సరసగుణుల.

భీ—తమ్ముఁడా! జ్యేష్ఠుఁడనగుటచే, నీసద్బుద్ధికతంబున నిట్లుపొగడఁజూచితివేకాని, వేఱొండుకాదు.

వి—కాదు. మహాత్మా! శ్రీరామచంద్రునికైవడి, పితృవాక్యపరిపాలనకై, రాజ్యభోగంబులనెల్ల విడనాడి, యువరాజుగనుండియు, నసమర్థులమగు మాకు రాజ్యాధికారమిచ్చి, సోదరవాత్సల్యమేపారఁ దగురీతిఁ గాపాడుచుండు మిమ్ములఁ గొనియాడ నేనెంతవాఁడను ?

భీ—సోదరా! అందులకేమికాని, నీకుఁ బరిణయమాచరింపఁ దల్లియనుజ్ఞ వడసి, కాశీరాజుపుత్రికలఁ దోడ్కొని వచ్చితిని. అందుఁ

బెద్దయగునాపెను, నాపెనమ్మతి ననుసరించి, సాళ్వునికడకంపి తిని. అంబికాంబాలికలను జేపట్టి సుఖంపుము.

వి—ఏనెంతయుధన్యుఁడను.

---

తృతీయరంగము.

---

(ప్రవేశము—భీష్ముఁడాసీనుఁడై యుండ, నంబ)

అం—(తనలో) తొలుత నీమహానుభావుని సెలవుఁగోరి పోయి, తిరుగనేరీతిని, వాయుదంతముఁదెల్పుదును ? ఎంతయుసంకటమయ్యె. ఎట్లైన నీతనిపాదములఁబట్టి వేడుకొనుటయే పరమోత్కృష్టము.

భీ—(అంబనుగాంచి తనలో) ఈయంబమరలివచ్చినది. ఏమిహేతువైయుండును ? (ప్రకాశముగ) ఓకన్యకారత్నమా !

ఉ. ఏమిది? ఖిన్నతఁ బొగల ♦ నేటికి? వంచననొందియుంటివో
భామిని మార్గమధ్యమున ♦ భారముకల్గెను శత్రుమూకచే
కాముకులై దురూహలను ♦ గావరమేర్పడమానహీనతన్
పామరులెవ్వరేనినినుఁ ♦ బట్టగఁజూచిరో తెల్పుదుఃఖించెదవ్.

అం—మహాత్మా ! అట్టిదేమియుఁ గలుగలేదు.

భీ—అయిన నీరాకకుఁ గతంబేమి?

అం—నిందుకొల్పున నందఱజయించి, తేరునందుంచి, యొకవీరుఁడు నినుఁగొనిపోవఁ దిరుగనేనెట్లు చేఁబట్టుదునని సాళ్వుఁడు ధిక్కరించె.

భీ—అయిన నిప్పుడేమి సేయుమందువు ?

అం—నాసోదరీలతోఁబాటు నన్నుఁగూడ—

భీ—అదెట్లులవడును? ధర్మవిరుద్ధము. నీకుఁ బ్రియమగువాని మఱొక్కనివరియించి సుఖయించుము.

అం—స్వామీ! మీరిట్లునిర్దయఁబూని, వీడిన నాకేమిగతి? నాబ్రదు కియులను వృథయేకదా!

భీ—ఇందు నాలోపమేమికలదు?

అం—ఆర్యా! లోపములనెంచ నిదియాయదను? దీనులగాచుటయే, ధీరులధర్మము.

భీ—నీవు వెడలుటతోడనే, శుభకార్యములుపూర్తియయ్యెను. ఆసాల్వునే వేడి, నీయభీష్టమునుదీర్చుకొమ్ము.

అం—క్రోధాగ్నినెదఁదాల్చుకున్న నెక్కమునవికలఁదు. విన్నవించుకొనియెద.

భీ—అబలలమీఁదనా యాగ్రహముఁజూపుట? తెల్పుము. న్యాయమైన నవలంబించెదను.

అం—(సిగ్గునభినయించుచు) తామే, యీదీనురాలిని జేపట్టి—

భీ—చాలుఁజాలు. నిదియానీకోరిక

గీ. నాదుప్రతిననువినలేదొ? నాతియేను
బ్రహ్మచర్యంబుననెయుండి ♦ వరలునట్లు
శపథమొనరించియుంటిని ♦ సత్యవాక్య
పాలనంబునవెనుదీయఁ ♦ బాపమగును.

నీకీవిషయము తెలియకుండుటచే నిట్లుకోరియుందువు.

అం—దీనత్వముననుండి, శరణని వేడినవారిని గావకుండుట పాపహేతువుకాదా!

భీ—శరణమన్నంతమాత్రమునఁ గానికార్యములఁజేయ నొడంబడుటెట్లు?

అం—అట్లైన నాతనువు నిష్ప్రయోజనమొనర్పదరా?

భీ—నే నేమిచేయఁగలను?

అం—నా పల్కు లాలింపరా ?

భీ—పాపభీతికి వెఱచి, యొడంబడఁజాలను.

అం—(క్రోధముతో)

గీ. నిన్ను వంచింపఁ బూనితి ♦ నెమ్మి నమ్మి
ఈతనువు నిప్పుడే విడి ♦ యింక బుట్టి
యసువుల వితీయ నెత్తింతు ♦ నబలనెల్ల
చింతబుచ్చుట చెల్లునే ♦ చేటు కాదొ ?

(అని నిష్క్రమించును)

భీ—ఏమైన నగుఁగాక. ఏ నొనర్చిన బ్రతిన నెరవేర్చుకొనెదనే కాని, తుచ్ఛసుఖముల కాసించను. శాపములకు వెఱువను.

---

## చతుర్థరంగము.

---

ప్రదేశము:—అంతఃపురము.

ప్రవేశము:—మత్స్యగంధి, భీష్ముఁడు

మ—కుమారా!

గీ. భర్తసుతులను బాసిన ♦ బాతకిదియ
నంచు ఘోషింప నెల్లరు ♦ నవని నెట్లు
ప్రాణముల నీడ కెటులఁ ♦ బఱఁగనగును
చింత చేకూరె బో యెదఁ ♦ జేరదివిని.

ఎన్ని రీతుల నూరట నొందుదమన్నను నిష్ఫలంబగుచుండెను. ఏమి సేయుదాన ? తనయా, నాయట్టి పాపాత్మురాలి ముల్లోకంబుల నెచ్చోటను గాన్పింపదు. నా ద్వితీయ పుత్రుఁడగు విచిత్రవీర్యుఁడైనఁ గొంతకాలము మనియుండి, వంశమును నిలుపఁజాలునని యెంచితిని. తుట్టతుదకు కీర్తిశేషుఁడయ్యెను.

భీ—జననీ! మీరనుడివెడిపల్కులన్నియు సత్యమే. అయిననేమిసేయఁగలము. భగవదాజ్ఞమీరుట కేరికిశక్యమగును? కాన విచారమునుడక్కుముతల్లీ

మ—తనయా! నాదొకకోర్కెకలదు.

భీ—తల్లీ! శక్యమైనవెంటనే నెరవేర్చెదను. కాన సత్వరంబునఁదెల్పుము.

మ—వంశక్షయముకాకుండఁ గాపాడుట నీయదేభారము.

భీ—ఏమిసేయుమనిసెలవు?

మ—వివాహముఁజేసికొని, వంశమువృద్ధినొందఁజేయుటయే నాయభీష్టము.

భీ—అమ్మా! మీరిట్లనుడువుట పాడియగునా? నిరతధర్మవ్రతావలంబకుఁడనైయుండఁ బ్రతిజ్ఞనొనర్చి. యిప్పుడెట్లు, ధిక్కరింతును. జననీజనకులేవిధమైన నీతులబోధింపనగునుగాని, యిట్టి యధర్మమాచరింప నాజ్ఞనొసంగుట న్యాయమగునా?

గీ. తనువు, లెల్లనువశియించుఁ ♦ దప్పకుండ
దీనిఁ దెలిసియువేఱగుఁ ♦ దెఱువుఁబోవ
నేల? జననియెబోధింప ♦ నేమితెఱువు
తల్లి! క్షమియించఁదగునెందుఁ ♦ దనయులనిల.

మ—అయిననిఁక నీవంశము నాశనమగుటయేకర్తవ్యముకాఁబోలును!

భీ—భగవదాజ్ఞయెటులుండెనో యట్లు జరుగకతప్పదు. అంతియేకాని, యనిత్యమగునీయిహలోకసుఖములకాశించి, నిరతముప్పీడని యపఖ్యాతికి లోనుగాలేను. (జయమగుఁగాక, భీష్ముఁడా! వంశక్షయమగునని చింతిల్లకుము. అట్లెన్నఁడును జరుగదు) అని యశరీరవాక్కు వినఁబడును)

(హారతి పాడుచుండఁ దెరపడును)

సంపూర్ణము.



రాజమండ్రి శ్రీగణపతిక్లబ్బు మెంబరులలో నొక్కరగు

# గుమ్మళ్ల సుబ్బారావుచే రచియింపబడియె.

నాటకప్రారంభమున సమాజకులందరుకలసి పాడుప్రార్థన.

నాదనామక్రియరాగం—మిశ్రగతి.

శ్రీవిశ్వేశ్వరునకు ప్రియసుతుడా శ్రీవిఘ్నేశ్వరధాతా, జయమా, నటులన్, కా, పా, డుము మమ్మున్ ॥శ్రీవి॥

రావామూషిక, వాహనరావా, పనిచెరుపులదొరరావా, రావావేగన్, నినుమాహృదయతో, యజములభజియింపు, చుంటిమి, యీ, స, మాజమునుసదా, బ్రోవుము ఆదిగణేశా, జయమా, నటులన్, కా, పా, డుము. మమ్మున్ ॥శ్రీ॥

(ప్రభాసురుడు)

1 కల్యాణిరాగం—రూపకతాళం

కాంతాగనుగొంటివేసీ—వీతపోవనిన్ ॥ కాంతా॥

ఎంతోనామదికియిపుడు—సంతసముదయించుచుండె ॥ కాంతా॥

వింతవింత జాజిపూలు—విరజల్లి యీవనమునంత

వంతతోకృశించువారి—చింతలెల్లబాపుయివ్వని ॥ కాంతా॥

(మునులు)

2 కన్నడరాగం—ఆదితాళం

(శాపమునిడుమమ్మా అనేవరుస)

దయగనుమాయమ్మా—విశ్వేశ్వరుకొమ్మ ॥దయ॥

నియమముతోడా—నిఖిలమునీశులు నీదరిజేరిబల్ నుతులుగావింతురు.

వా యాలాపనవిని—దర్శనమిడిధన్యుల జేయుము భాగీరథి
మము ॥దయ॥

(మునులు)

3 వసంతరాగం—ఆదితాళం

సంతసంబు మామదినుదయించెన్ -చింతలెల్లదీరెనుగదతల్లీ ॥సంత॥
యింతవారైననీ చెంతకరిగి—సర్వవిధంబుల స్తోత్రముజేతురు ॥సం॥
ఎంతో ధన్యులుగా నొనర్చితివో—యమ్మనీదుదర్శనమిడిమమ్ము
యెంతనినినుగొని యాడగలముజగ—మంతనీవె గంగాభవాని ॥సంత॥

(గంగ ప్రతీపునిజూచి)

4 బేహాగ్ రాగం—ఆదితాళం

1 ఆహా, హా, యీ, భూపాలుడుకడు—మోహన కారూడే.
యీతడూ, గంధర్వుండేమొ—లేకబల్ సురవరుడో యితడు ॥ఆహా॥

2 వంటరిగాయీ వనసీమలోయిత—డుండుటగతమేమో యా
పూర్ణేందుని గాంచనామదిన్-మారునితాపంబుదయించెన్-యెటుల వీ
నిచే బట్టినాకోర్కెలు—దీర్చుకొనుట యెటులో—వీనితోగూడుటయె
న్నటికో ॥ఆహా॥

(శంతనుడు తండ్రిచెప్పిన వాక్యములువిని)

5 మోహనరాగం—ఏకతాళం

ఎన్నడునాకన్నులార—యన్నులమిన్నను గాంతునో యనినా
మదిత్వరజేయుచు నుండెన్ హా ॥మో॥

కన్నతండ్రి యీతొయ్యలి వయ్యారములన్ని దెలుప క్రిన్నన
యా పూర్ణవదన నెన్నడుచే బడుదుననుచుచిత్తము తత్తరంబొందుచు
నుండెన్. హా అహా ॥మో॥

(శంతనుడు గంగనుజూచి)

6 బేహాగ్ రాగం—జుల్వాతాళం

అహా యెవ్వతెయీబాల యివ్విధమున యీలోలా నొంటరిమై
నిట నిలువ నేల ॥అహా॥ యెవ్వ॥

యీగుణశీలా యలసెనుజాలా అయ్యో యలసెనుజాలా మొ
గమునుగన జెమ్మటచాలా ॥అహా॥ ॥యెవ్వ॥

(గంగ శంతనునిజూచి)

7 యమునాకల్యాణి—చతురశ్రగతి

(సుందరా కారా రారా అనెవరుస)

సుందరాకారుఁడెవరో చందురునిబోలియెంతో యందముగా
నుండెగా ॥సుం॥

మందయానల డెందము దొంగిలిచేయునటునుండె యీకాంతు
ని మేనుకాంతి ॥సుం॥

ఎందునైననూ యీపూ—ర్ణేందుని గాంతునా సందియమేల
నూ బల్ సుందరుడల్ ॥సుం॥

(శంతనుడు బాలుని జంపవలదని)

8 కీరవాణిరాగం—మిశ్రగతి.

వలదయ్యో బాలుని జంపవలదు ॥వల॥

బాలనీదుచిన్నిశిశువు గోలబాలజేయుచుండ యేలయింతకఠిన
హృదయు రాలవై యొనర్చుచుంటి వయ్యో పాపముమన కయ్యో గల్గు
నువలదయ్యో బాలునిజంపవలదు ॥వల॥

(శంతనుడు బాలునిజూచి)

9 గుల్తాన్ రాగం—చతురశ్రగతి

(జగదీశుమాయలను అనెవరుస)

యితడెవరిబాలకుడో యివ్వనమునకడు నాటలునాడుచునుండె॥యి॥

యాతనయునిగన్న తరుణీమణి యెవ్వరో వారిగృహంబెల్ల పావనంబా
వరించు. సతతము యీకుట్టదూ మరియునూ యీతని జూడయేకభూ
తలేశుని పుత్రుడని నామదిదోచె—నాహా—యీబాలుడెన్నే నాట
లు నాడుచునుండె ॥యిత॥

(శంతనునియొద్దకు భీష్ముఁడరుదెంచె)

10 మోహనరాగం—ఏకతాళం

నిఖిలజనంబులు నిరతమునమితా నందముతో నిడుజోహారుల్
గొను—యెకిమీడా—ఘనపోఢా—ప్రజలెల్లా నినుపొగడా ॥నిఖ॥
అనవరతముమిము మనమునసిడుకొని మానుగసేవలొనర్చుచుండిన సు
కుమారుండగు యీతనయుడుమీకనయము భక్తితొనిడుజోహారులు-
గొనుమోజనకా—జాగొనరింపక ॥నిఖ॥

(పౌరులు)

11 హిందుస్థానికాఫీ—ఆదితాళం

దేవా మాకెదికలోత్రివాబత్రుకలేమికబోత్రివా యిత్తరివేగరావ
॥దేవా॥ యేమనిదెల్పుదుమొ భూవరా అయ్యో మృగంబులెన్నొన్నోవ
చ్చి సస్యములను నస్యముగ జేయుచునుండెన్ ॥దే॥

(శంతనుడు నదీతీరమునుజూచి)

12 బేహాగ్ రాగం—జుల్వాతాళం

(కాంతాయీయుగ్రవనం అనెవరుస)

అహాహా! యీసరయూ తీరంబెంతో రమణీయంబై నామదికి
తోచెదున్ ॥అహా॥

మహామోదముతో యీహరిణమెంతో గంతులిడుచు పచ్చికమే
యుటకుబోయెదున్ అహా యీదెసగాంచగ అహ్లాదము జెందునటుల

వివిధపుష్పఫల శోభితమున్ పాంథులచిత్తంబెంతో రంజిలజేయుచునుం

డెడి మలయమారు తంబుగనంగన్ ॥ఆహా॥

(శంతనుఁడు మత్స్యగంధినిజూచి)

13 నాదనామక్రియ—మిశ్రగతి

వయ్యారియెవ్వారో వయ్యారె దీనిబోలు తొయ్యాలిందెందైన

గలరెవెయ్యారు జగములుగనిన బల్ సయ్యాటలకు కటుమిన్న యీ

చూపుల్—మరుతూపుల్ గద ॥వయ్యా॥

(శంతనుఁడు పరితాపము)

14 మోహనరాగం—రూపకతాళం

పోయెనయ్యో యీపొలతి పొలుపుగననువీడి యిత్తరి పోవు

చుండెగా— ॥పోయె॥

యీమెలనాగ రూపురేఖ విలాసమునాయెదనునాటయేమిసే

పదేమిసేతు ॥పోయె॥

ఆయలివేణి పలుకులు నామదికి ములుకులుగ నాటన్ దైవ

మా నేనెటుల మరతు ॥పోయె॥

(తండ్రివిచారముగూర్చి భీష్ముఁడు)

15 హిందుస్తానీముఖారి—రూపకతాళం

ఏమిహేతువో నాజనకుండిటులుండగ ॥ఏమి॥

అమితఖేదము నామనంబునకు బాడముచునుండెనయ్యో యేమి

గత మొదెలియదయ్యో—భవనమునకళహీనమయ్యె దైవమా—యిమ్మి

టుజేయన్యాయమా—నీకిది శ్రేయమా ॥ఏమి॥

(దాశరాజు)

16 దేవగాంధారిరాగం—ఆటతాళం

మత్స్యముగర్భంబున యీముత్యము జన్మించెనయ్యా సకలసద్గుణశీలాఅత్యంత ప్రేమతోడ నలరుచుండె మద్గృహమున నిత్యముతన భర్తసేవ నంబెమదిని నిలుపునయ్యా వేగమె—జాగుచేయక—గొంచు పొండయా—సాధుబాలికన్ ॥మత్స్య॥

(భీష్ముడు తండ్రిమరణమునుగూర్చి)

17 కన్నడదర్బారు—మిశ్రగతి

ఏమిదీ—విధీ—మాజనకుండేగె దివికి ॥ఏమి॥

మమ్ములవీడిపోవనీదు—మనమున నెటుల నెంచితో జనక మా దగు శ్రేయములన్ గని అనయముమము బోచుచునీవు యిటులను మదిన్మా మోహనివీడిజనగ తగునజనక యేమిజెప్పి తేగితయ్యా మమ్ముజూచువారెవరయ్యానిన్ను మరచు టెటులనయ్యా ॥ఏమి॥

(మంత్రి)

18 హిందుస్తానీముఖారి—రూపకం

ఏల నీవి లీల జాల—జాలి దూలనేలనయ్యా ॥ఏల॥

బాల కానీవిటులమదిని గోలచేయుచుంటతగున ॥ఏల॥

అలీకముమానినీవు ధైర్యమూను మయ్యాయ్యా ॥ఏల॥

(హారతి)

19 బారువారాగం—ఆదితాళం

హారతిగైకొమ్మా యోగారీ సరగునరాకమ్మ ॥హార॥

అరవిదిమోముల వేలుపురాణి గొనుమాశార్వాణిజయహారతి గైకొనుసుశ్రోణి ॥హార॥

మంగళం

శ్రీ. శ్రీ. శ్రీ.

సంపూర్ణము.



# రట్టమతశాస్త్రము

ఇది రట్టఁడను నతఁడు కన్నడభాషలో వ్రాసిన గ్రంథము. అయ్యలరాజ అన్నయభాస్కరుఁడును రచియించిరి 154 సంవత్సరములక్రితము యీగ్రంథము తెనిఁగింపఁబడినది దానిని సత్యవోలు అప్పారావుగారిచే తర్జుమానువదింపించి లఘుటీకతో 16 పానులుయుంచి కాగితముపై పెద్ద తెనుగున ముద్రింపించినాము. అనేక ఋతు తెగిఁపోవుచున్నవి అతిశయోక్తి కాదు. వెల రు 1—0—0

# బసవపురాణము

అఁబస్వరూపము లైనజీవులు చలించుననియు గాని స్థిరముగ నొక్కతావున నిలుచునవి గావనియు నశాశ్వతము లైనశరీరములలోఁ బ్రవేశించిన జీవులు సంచరించు స్వభావము గలవి. గావున జంగములనియు నట్టిజంగమము లగుజీవులు శరీరమునువిడుచుట సహజమని నెఱుంగ వలయుననియు లోకమానవుల బోధించి జంగమమతమును స్థాపించిన బసవేశ్వరునిచరిత్ర మిందు విపులముగ వ్రాయఁబడినది. ఈగ్రంథము లలితము లగుపదములతో మధురములగువాక్యములతో మ॥ రా॥ శ్రీ॥ సత్యవోలు అప్పారావుగారిచే వ్రాయబడినది. బాలురకైతము సుబోధకముగ నర్థముచేసికొనునట్టుల పండితులుసైతము భేదింప నలవిగాని వేదాంతవిషయము లిందు తేటతెనుగుమాటలతో వ్రాయబడి యున్నవి. అచ్చుపడుచున్నది. వెల 1 కి రు. 1—^—0

వంటెద్దుల తిస్సయ్య బుక్కుసెల్లర్స్, రాజమండ్రి.

